NAVASAKTI అణా Telugu Weekly




కార్మిక కర్షకులారా! ఏకముగండు!!

సాలు చందా 3-0-0 ప్రచురణ: ప్రతిబుధవారం సంపాదకుడు: మద్దూరి అన్నపూర్ణయ్య

సంపుటం ౧. } రాజమండ్రి 16—2—38 } సంచిక ౧౦.

సుభాస్ బోస్.




హరిపుర కాంగ్రెస్ అధ్యక్షుడు



# రైతులోకం

## రైతు రక్షణ యాత్ర.

ఈ నెల 16వ తేదీనుండి రాయలసీమలో రైతురక్షణ యాత్ర ప్రారంభ మవుతుంది. రైతులు యాత్రికులను ఆహ్వానించ ప్రార్థన.

నండూరి ప్రసాదరావు,
ఆం. రా. రైతుసంఘం.

## రైతులకు హెచ్చరిక.

జిల్లా రైతు సంఘం అను పత్రికనుండా, వేరేప్రస్త కాలమీద కొంద రుసభ్యులను చేర్పించుతున్నారు. అవి చెల్లవు. జిల్లారైతుసంఘంవారిచే పంపబడిన వాటిమీద చేరితేనే అంగీకరిస్తాము. ఈ నెలాఖరులోగా సభ్యులు చేరాలి. సభ్యత్వపుస్తకాలు రుసుము మార్చి 1వ తేదీలోగా మాకు చేరాలి.

సుంకర సూర్యనారాయణ,
ప్రధాన కార్యదర్శి.
కృ. జి. రైతుసంఘం.

## పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం

గన్నవరం తాలూకా రైతు కార్యదర్శి రామకోట య్యాచౌదరి గారు రైతుపరివారానికి గూడెం మాధవరం వచ్చారు. ఈవార్త తెలియగానే డప్పు వాయించే వాని దగ్గరనుండి జమీందారిగారి మేనేజరు డప్పులాక్కొని 'మీ కాంగ్రెస్' తో చెప్పుకో మన్నాడు. వీరి ప్రతాపం ఇలా డప్పుల మీదికి సాగింది.

చాగర్లమూడి కృష్ణయ్య,
గూడెం మాధవరం.

## ఫారెస్టు బాధలు.

గొట్టివరంలో సుమారు 300 రైతుకూలీల సభజరిగింది. కామ్రేడ్ చేగిరెడ్డి బాలిరెడ్డి ఫారెస్టు బాధలగురించి మాటాడారు.

## వెంకటగిరి అరణమాలలగోడు

26—1—38 వ తేదీన పాలెంకోట దక్షిణభాగాన అరణమాలలు కట్టెలు కొట్టుకొను చుండగా సుమారు 60 మంది ఫారెస్టు వాచర్లు మీదపడి సామాను, కట్టెలు లాగుకున్నారు. బండబూతులు తిట్టారు. మున్సబు దగ్గరకు కట్టెలు తీసుక పొమ్మనిరి. నిరాకరించినందున పైనబడి కొట్టిరి. 30 మంది పైన ఇంతమంది అన్యాయం చేశారు. కాంగ్రెసువారు, కార్మిక నాయకులు గమనించ ప్రార్థన.

బీరం రామనాథం,
యువజన సంఘకార్యదర్శి.

## వ్యవసాయ మంత్రిగారిరాక

గౌ॥ వ్యవసాయమంత్రిగారు కృష్ణాజిల్లాలో మార్చి నెలలో రెండు రోజులు పర్యటనం చేయుటానికివాగ్దానం చేశారు.

సుంకర సూర్యనారాయణ.

## దివితాలూకా రైతుసంఘం

రైతుసంఘ సభ్యత్వ పుస్తకాలు ఈ క్రిందివారివద్ద దొరుకుతాయి.

| | |
|---|---|
| కాకర్ల చంద్రశేఖరరావుగారు, | పెదముత్తేవి. |
| గుత్తికొండ సత్యనారాయణగారు, | చల్లపల్లి. |
| కొప్రపాటి రామేశ్వరరావుగారు, | చల్లపల్లి. |
| కోనేరు రాజగోపాలరావుగారు, | అవనిగడ్డ. |
| వేములపల్లి వెంకయ్యగారు, | కొత్తపేట. |

ఈనెల 20వ తేదీలోగా రుసుముతో లిష్టులను పంపాలి రుసుము పంపనిదే సభ్యత్వం అంగీకరించబడదు.

గుత్తికొండ సత్యనారాయణ,
కార్యదర్శి, ది. తా. రైతుసంఘం,
చినకళ్లేపల్లి. శ్రీకాకుళం పోస్టు.

## గ్రామ రైతుసంఘాలు

### దోనేపూడి

| | |
|---|---|
| అధ్యక్షుడు:— | వెనిగళ్ల రామకోటయ్య. |
| కార్యదర్శి:— | వెనిగళ్ల సత్యనారాయణ. |

### అనంతవరం.

యీనాడు గ్రామరైతు సంఘసభ్యులు దొడ్డపూడి సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతక్రింద సమావేశమై నూతన సంవత్సరమునకు యీక్రిందివారిని అధికారవర్గంగా ఎన్నుకొనిరి.

| | |
|---|---|
| అధ్యక్షుడు:— | కోటయ్యగారు. |
| కార్యదర్శి:— | నాగభూషణం గారు, (బుచ్చయ్య) |
| ఉపాధ్యక్షుడు:— | గ్రాడి వెంకటరత్నం. |

అనంతవరం, 28—1—38. { ధూళిపాళ్ళ కోటయ్య. తాలూకా ఆర్గనైజరు.

### చింతలపాలెం తాలూకా.

### శ్రోత్రియం గ్రామరైతుసంఘం.

29—1—38 తేదీన యీ గ్రామమందు 50 మంది రైతుసంఘ సభ్యులుగాచేరి యీక్రిందివారిని కార్యనిర్వాహక వర్గమునకు ఎన్నుకొనిరి:—

| | |
|---|---|
| మారపరాజు సుబ్బారావు, | (అధ్యక్షులు) |
| చేబోలు రంగయ్యనాయుడు, | (కార్యదర్శి) |

ఎ. వి. కృష్ణయ్య,
ప్రధానకార్యదర్శి,
కావలి తాలూకా రైతుసంఘం.

## స్వీకృతి.

కథాంజలి (మాసపత్రిక.)
32 కిష్టప్పనాయక టాంకువీధి, జి. టి. మద్రాసు

ఆరాధన
సహదేవ సూర్యప్రకాశరావు, రాజమండ్రి.

నత్తెనపల్లి తాలూకాలో ఫారెస్టుబాధలు.
మాదల వీరభద్రరావు, మాచవరం, నత్తెనపల్లిపోస్టు.

స్వయంకృతాపరాధము
శ్రీరామారావు.

## విద్యార్థుల సమ్మెలు.

నెల్లూరు విద్యార్థుల సమ్మె కొన్ని షరతులంగీకరించటచే విరమించబడినది.

★

బందరు హిందూకళాశాల విద్యార్థుల సమ్మె జరుగుతున్నది. 7వ తేదీని ప్రారంభమయింది. శాంతంగా పికిటింగుచేస్తున్నారు. విద్యార్థులు, ఉపాధ్యాయులు కూడా తిరిగి వెళ్ళవలసి వచ్చింది. ఒకసారి కొందరు పడిఉన్న విద్యార్థులను తొక్కి వెళ్లారు. ఇతరకళాశాల విద్యార్థులు సానుభూతి చూపారు. రోజూ ఊరేగింపులు, సభలు జరుగుతున్నాయి. గుంటూరునుండి ఇతర ప్రాంతాలనుండి విద్యార్థి సంఘనాయకులు విచ్చేశారు.

★

ఆంధ్ర యూనివర్సిటీలోని కామర్సు విద్యార్థుల సమ్మె తీవ్రంగా సాగుతున్నది.

## కూలీలసభ.

వి. వి. నరసింహం, యం. యల్. ఏ. గారు తెనాలి వచ్చారు. కామ్రేడ్ డి. పి. లోకనాథంగారి అధ్యక్షతక్రింద ఫ్యాక్టరీ కూలీల సభజరిగింది. కూలీల కష్టాలు, సంఘాల ఆవశ్యకతను గూర్చి వి.వి. నరసింహం, పోలేపెద్ది నరసింహమూర్తిగారలు మాట్లాడారు.

ఆరవేటి రామయ్య, తెనాలి.

## విశ్వనాథపల్లియువజనసంఘం

కృష్ణాజిల్లా విశ్వనాథపల్లి గ్రామంలో యువజన సంఘం స్థాపించబడింది. బుర్రా కృష్ణమూర్తిగారు కార్యదర్శిగను, జాయింటుకార్యదర్శులుగా వేమవరపు వెంకటచలం, శంకరమంచి సూర్యనారాయణ గార్లను ఎన్నుకొన్నారు. నవశక్తి, వాహిని, ప్రజాబంధుల తెప్పించుటకు, ఖాదీవాలాను విడుదల చేయాలి. సి. ఐ. డి. లు రద్దు చేయాలను మొదలగు తీర్మానాలు గావించారు.

## కర్నూల్ జిల్లా యువకులకు

### విజ్ఞప్తి.

ఆంధ్ర రాష్ట్రయువజనసంఘ కార్యనిర్వాహకవర్గము నన్ను కర్నూల్ జిల్లా యువజన సంఘముల ఆర్గనైజరుగ నియమించారు. సభ్యత్వధరఖాస్తు పుస్తకములు, కార్యప్రణాళికలు అచ్చొత్తించబడినవి. మార్చినెల ఆఖరువరకు సభ్యులను చేర్పించ గోరుచున్నాను. ప్రస్తుతము జిల్లాలో పనిజేయుచున్న ప్రాథమిక యువజన సంఘముల వివరములు తెలుప గోరుచున్నాను.

ఇట్లు
వి. రంగా రెడ్డి.
యువజనసంఘ కార్యాలయము
గిద్దలూరు



## కాంగ్రెసు అధ్యక్షుని భవ్య భవిష్యత్తు

వరుసగా రెండేళ్ళు కాంగ్రెసు మహాసభాధ్యక్ష పీఠాన్ని అలంకరించి తన కిరీటాన్ని తుల్యుడైన సుభాన్ బోసుకు సమర్పించి ఉద్యోగబంధమునుండి నేడే విముక్తి నొందుచున్నాడు జవహర్‌లాలు పండితుడు. కాంగ్రెసు చరిత్రలో వరుసగా రెండేళ్ళు అధ్యక్షునిగా నెన్నుకోబడే అపూర్వ గౌరవం పొందు భాగ్య మొక్క జవహరులాలుకే లభించింది. ఏడేండ్లక్రితము విజయగర్వముచే దేశమంతయు మైమరచియుండిన ఆ గాంధి—యిర్విను సంధిరోజులలో యేకాకియై నిల్చి కరాచీ కాంగ్రెసులో గాంధి—యిర్విను సంధిని ప్రతిఘటించిన సుభాష్ చంద్రుడు నేడు యేకగ్రీవంగా కాంగ్రెసు గద్దె నెక్కగలిగినాడు. ఎంత ప్రతిభావంతుడైనను మహాత్ముని ఆశీర్వచనం లభిస్తేనే గాని కాంగ్రెసు పీఠము నధిష్టింపజాలడని దేశంలో ప్రతీతి యేర్పడింది. ఇప్పటికి ఆయాశీర్వచనం బోసుకు లభించింది. కారణ మేమి యని ఆలోచించాలి.

జవహర్‌లాలు మొదటినుంచీ తీవ్రవాదియైనా మహాత్మాగాంధీయొక్క దత్తపుత్రుడే యెల్లప్పుడూ. కాని గాంధి, బోసులకు ఎప్పుడూ చుక్కెదురే. పేర్మోసిన మోతీలాలునెహ్రూయొక్క సుపుత్రుడు జవహర్‌లాలు. విదేశ విద్యను బాగుగా గడించినవాడు. అతని లక్నో అధ్యక్షోపన్యాసాన్నిగూర్చి విమర్శించుచు స్టేట్సుమన్ పత్రిక "దొరగారు మాట్లాడుతున్నారు" (An Englishman speaks) అని వ్రాసింది. భావాన్ని మించేభాష అతనిది. ఉత్సాహం, ఉద్రేకం, కోపం, నీరసభావంపట్ల యేవగింపు, క్షుద్ర గూఢపుతాలీలంటే అసహ్యం—యివి అతని సహజ లక్షణాలు. కమలా వియోగ దుఃఖభారము, యూరపు సంచారానుభవం అతన్ని మరింత తీండ్రించ చేశాయి. ఆధ్యాత్మిక ముసినత్తముడైన గాంధి వెనకాల జన సమూహాలు ఎట్లు వెర్రెత్తి పరుగులిడ్తాయో అదే మత్తుతో కేవలభౌతికవాది(Materialist)అయిన నెహ్రూ వెనకాల కూడా పరిగెత్తాయి లక్నోలో. దేశపరిస్థితులా ఉత్సాహకరంగా లేవు. సత్యాగ్రహోద్యమం చల్లారిపోయిన తర్వాత పార్లమెంటరీ దృష్టి నాయకులలో బాగా కల్గి, శాసనసభ యెన్నికలలో దేశాన్ని ముంచెత్తిద్దామని ఉవ్విళ్లూరుచున్న రోజులవి. అతివాదానికి అణుమాత్రం ఆస్కారం లేని అభాగ్య సమయ మది. సామ్యవాదమే తారకమంత్రమని, మంత్రిపదవీ స్వీకారం స్వాతంత్ర్య పోరాటానికి సమ్మెటదెబ్బ యని గర్జించిం దప్పుడు వీరజవ్వరు కిశోరము. వచ్చేయేడు కూడా జవ్వరునే అధ్యక్షుడుగా చెయ్యాలన్నది యీ వ్యాసకర్తతో అప్పుడొక అలహాబాదు అమ్మాయి. అయిదేళ్ళు వరుసగా అతడే కావాలన్నాడు మరో అబ్బాయి. జవ్వరులాలు యొక్క ఆశ(Ambition) కూడ అంతే అన్నాడు అతని ఆంతర్యమంతా తెలిసినట్టు యింకో యువకుడు. అలహాబాదులో స్వరాజ్య భవనానికి వెళ్ళి ఆలిండియా కాంగ్రెసు కమిటి ఆఫీసు చూస్తే పక్కా గవర్నమెంటు సెక్రటరీయట్‌ను మించి వుంటుంది వ్యవహారమంతా. కాంగ్రెసు తప్పక అధికారం లాక్కొని తీరుతుంది యన్పిస్తుంది ఆకార్యాలయం చూస్తేను. అంతవరకు కాంగ్రెసు అధ్యక్షపీఠం కేవలం గౌరవస్థానంమాత్రమే. కాని జవ్వరు గద్దె యెక్కిన తర్వాత అది అధికార పీఠమయిపోయింది. కాంగ్రెసు మహాశక్తియనితోపించి తీరుతుంది ఆఫీసుయొక్క తీరు. యిటీవల మాట్లాడుతూ అన్నాడు జవ్వరు "ఉద్యోగ భారంచే అలసిపోయాను" అని. అలసట వచ్చేసినట్లే కనపడుతోంది అతని యిటీవలి మాటలు, చేతలు. మనస్సుయొక్క ఉద్వేగం అంతా మందగించేది వార్ధా చేరగానే. వార్ధావ్యూహాన్ని ఛేదించడానికి అభిమన్యుడులా చొచ్చుకొని వెళ్లేవాడు. పాపం తిరిగి రాలేక పోయేవాడు. కోట్లకొలది విన్నారు కొండంత ఉత్సాహంతో అతనిపడేశాన్ని. తువ్వాలు తిప్పలుగా సంపాదించేవాడు కాంగ్రెసు ఘతవాదులు. జనసమూహం యొక్క వోట్లు, సంపాదించి సామ్యవాద సోదరు నే కుక్కేశారు చెరసాలలలో. మైసూరు సంస్థానంలో జరిగే ప్రజా పోరాటాన్ని ఆలిండియా కాంగ్రెసు కమిటీ ఆశీర్వదించినా దాన్ని త్రుంచేశారు "ఆధ్యాత్మిక వాదులు". కుర్చీలో రైతు రక్షకుడు జవ్వరును కూర్చోపెట్టేమే ఖండించేశారు బీహారు రైతునాయకులను. ఆఖరికి సంస్థానాలలో కాంగ్రెసు సంఘాలే అక్కరలేదని అన్నారు. "ఉద్యోగ స్వీకారంలో సగం నమ్మకం కల్గింది"అనే స్థితికి వచ్చి వెళ్ళిపోతున్నాడు వీరజవ్వరుడు. కాన్పూరు కాల్పులను సమర్థించే దన్న కళంకంనుండైన కాచుకోలేక పోయాడు. మైనారిటీగ్రూపులో నుండి అధ్యక్ష స్థానాన్ని అంగీకరించినవాని కెన్ని అసౌకర్యాలున్నాయో స్పష్టంగా వెల్లడిచేసింది జవ్వర్ యొక్క కాంగ్రెసు అధ్యక్ష చరిత్ర.

### సుభాన్.

జవహర్‌లాలు యింగ్లాండులో బారిష్టరు పరీక్ష ప్యాసయితే సుభాష్ చంద్రుడు అక్కడే ఐ. సి. యస్. పరీక్షలో గెల్చివచ్చాడు. ఇద్దరికి విదేశ సంచారం, అనుభవం కావలసినంత వున్నది. పేరుమోసిన మోతీలాలు కాతను సుపుత్రుడైతే దేశ బంధు దాసు కితడు కుడిభుజం. కలకత్తా కార్పొరేషను ఎక్జిక్యూటివ్ ఆఫీసరుగా యితడు చేసిన పని గవర్నమెంటును హడలి బేజారెత్తించింది. ఇతన్ని యింకా అరవై దెబ్బది మందిని డిటెన్యూలుగా ప్రభుత్వంవారు తీసికొని మాండలే జైలుకు పంపేశారు. కాంగ్రెసు పుట్టినతర్వాత ఒక్క లోకమాన్య తిలకుతప్ప మరే కాంగ్రెసు నాయకుడు యిన్ని కష్టాలు పడలేదు. ఆ రోజులలో బ్రిటిషు సింగంయొక్క జూలునైనా పట్టుకొని వ్రేలాడవచ్చుకాని గాంధిని ఎదుర్కొనడం అసంభవం. కాని బోసు మాత్రం తాను నమ్మినదానిని ఎన్నికష్టాలైనా ఎదుర్కొని ఆచరింపగల అసాధారణ ధైర్యశాలి. లాహోరు కాంగ్రెసులో శ్రీనివాసయ్యంగారితో కలసి గాంధిని యెదుర్కొని పరిషించడం కమిటీ సత్వాన్ని గోల్పోయినాడు. అంతేకాదు. కాంగ్రెసు ప్రెసిడెంటు గిరినే గోల్పోయినాడని చెప్పవచ్చు. కరాచీలో యేకాకియైనా చలింపకుండా యేనాడైతే గాంధిని యెదుర్కొన్నాడో ఆనాడేయాతడుమహా కష్టాలు పడటం నిశ్చయ మనుకున్నాం. ఎవరినైతే సామ్రాజ్యవాదుల పరమశత్రువుగా భావిస్తారో ఆతనికి సంఘంలో బలమున్నంతసేపు అతనిపై దేయి వేయడానికి కొంత తటపటాయిస్తారు. ఎప్పుడైతే అతడు యేకాకి యౌతాడో అప్పు డతనిని మాడ్చి వేస్తారు. సూరత్ కాంగ్రెసులో లోకమాన్యుని పరిభవించి గోఖ్లే ప్రభృతు లాతని తరుమగొట్టినపిదపనే ఆతనికి ఆరేండ్లు దీర్ఘప్రవాసం సిద్ధమైంది. సరిగా సుభాసకు అదే స్థితి పట్టింది. అంతకు ముందు రెండేండ్లనుండి కాంగ్రెసుకు కార్యదర్శిగానున్న సుభాన్ బోసును లాహోరులో తన్నెదిరించినందుకు ఫలితంగా వర్కింగు కమిటీలో లేకుండా చేశారు గాంధీగారు. కరాచీలో తిరిగి తన్నెదిరించాడని మరింత ఆగ్రహం వచ్చింది వారికి వారి అనుచరులకు. బోసు 'దౌర్జన్యవాది'యనిఫిర్యాదులు చేయిమహాత్ములవారికి. కాంగ్రెసుప్రథమ సూత్రాన్ని అంగీకరిస్తూ ధర్మసమ్మతమైన శాంతి పద్ధతులమీద సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించు లక్ష్యమునకు కట్టుబడి సంతకం చేసి సుభాస బోసు కాంగ్రెసు సభ్యుడుగా నున్నప్పటికి, యిదివరలో కాంగ్రెసుకు కార్యదర్శి యైనప్పటికి వరుసగా యేళ్ళకొద్ది బెంగాలురాష్ట్ర కాంగ్రెసు సంఘాని కధ్యక్షు డైనప్పటికి యీయన 'దౌర్జన్యవాది' యవునో కాదో కనుక్కొనిరమ్మని కృష్ణదాసును పంపేడు గాంధీమహాత్ముడు. కృష్ణదాసు బజారు కబుర్లన్ని మూటకట్టి కథలల్లి కవరులో వ్రాసి గాంధికి పంపేశాడు. అది పోలీసుల చేతికి చిక్కడము. విమ్మట విశేషకాలం బోసును స్టేటుఖైదీగా ఉంచిన వ్వుడు ఢిల్లీ అసెంబ్లీలో ప్రశ్నవేస్తే ఇండియా గవర్నమెంటు లా మెంబరు కృష్ణ

(మిగతా 10 వ పేజీలో)

# వైరాగ్యకాంక్ష ★

శ్రీ
కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.

కథ ★

**★ పూర్వకథ.★**

సుబ్బావధాన్లు పెద్ద భూ కామందు. రామన్న పేద రైతు. అవధాన్లు వేదాంతం చెప్పేవాడు. రామన్నకు వేదాంతులంటే భక్తి. సుబ్బావధాన్లు వేదాంతం పేరిట పొట్లకాయలు కోసుకుంటాడు. పాత నాగలి ఇస్తానని భ్రమ పెడతాడు. ఊరికే నారింజకాయలు కోసుకుంటాడు. అవధానులుగారు పనసపండ్లు సంతలో అమ్మి పెట్టమంటాడు తన పాలేళ్ళ పని చెడుతుందని.

రామన్న సరేనని ఒప్పుకున్నాడు. మర్నాడు ఉదయం సుబ్బావధాన్ల యింటికెళ్ళి, ఆ నాలుగు పనసపండ్లను ఒక కావిళ్లో వేసుకుని సంతకు బయల్దేరాడు. సంత ఆ గ్రామానికి 4 మైళ్ళ దూరంలో ఉన్న మరొకవూళ్ళో జరుగుతుంది. బరువు అతనికి అలవాటే కాబట్టి సులభంగా వాటిని సంతకు మోసుకెళ్లాడు. వాటిని సాధ్యమైనంత హెచ్చు ధరకు అమ్మాలని రామన్న సాయంత్రం వరకూ సంతలోనే ఉన్నాడు. ఆఖరికి ఆ నాల్గింటినీ 3 రూపాయల కమ్మి, సొమ్ము మొలలో దోపుకొని, కావిడ బుజానికి వేళ్లాడేసుకుని, యింటికి బయల్దేరాడు. సగం దూరం వచ్చాక నల్లని మేఘాలు నాలుగు మూలలూ వ్యాపించి, హోరున పెద్ద వర్షం ప్రారంభమయింది. దారి పొడవునా బాటి మోకాలు లోతు వరకు వచ్చింది. ప్రొద్దున్న తిన్న అన్నం అరిగిపోయి శరీరంలో నీరసంగా ఉంది. తల, కాళ్ళు పూర్తిగా తడిసిపోయి వర్షపు నీళ్ళతో నానిపోతున్నాయి. వర్షం తగ్గే సూచనలు కనపడ్డం లేదు. త్వరగా యిల్లు చేరుకుందాం అనే ఆశతో చురుగ్గా నడవటం మొదలెట్టాడు. ఈ తొందరవల్ల కాలు జారి ముందుకు పడ్డాడు. శరీర మంతా బురద, బట్టలు బురద! నెమ్మది నెమ్మదిగా కుంటుకుంటూ నడిచాడు. సంత జరిగే గ్రామానికీ అతని గ్రామానికీ మధ్య ఉప్పుటేరు ఒక టుంది. దాని మీద తాటి బోదె ఒకటి వంతెనగా వేయబడి ఉంది. ఈ వానకు కాలువ పూర్తిగా నిండి, తాటి బోదె కొట్టుకుపోయింది. రామన్న భగవంతుని ప్రార్థించుకుంటూ యీ ఉప్పుటేరు దగ్గర కొచ్చాడు. వంతెన లేక పోవడం చూశాడు. పావుగంటసేపు అట్లానే వర్షంలోతడిసిపోతూ నిలబడ్డాడు. ఏమిచేయడానికీ తోచక, ఆఖరికి ధైర్యంచేసి కాలువలో దిగాడు. కాలువచాలా లోతుగాను, నీటివడి హెచ్చుగాను ఉంది. లోపలికి దిగాడు. ఇంకా దిగాడు. నీళ్ళు పీకవరకు వచ్చాయి. మునిగి పోతానని భయం వేసింది.

వచ్చీరాని యీత మొదలెట్టాడు. దుర్బలశరీరంవల్ల యీదలేక ప్రవాహంలోపడి కొట్టుకు పోతున్నాడు. కొంతదూరం కొట్టుకుపోయాక, అరటిబోదె ఒకటి అతనిచేతికి దొరికింది. "బ్రతికామురా దేవుడా!" అనుకొని, దాన్నిపట్టుకొని నెమ్మదిగా ఒడ్డుచేరుకున్నాడు.

కట్టుకున్నపంచ, తానూ తడిసిపోయింది. కావిటిబద్ద ప్రవాహంలో విడిచిపెట్టేశాడు. పంచలో దోపుకున్న మూడు రూపాయలూ ఉప్పుటేట్లో కలిసిపోయాయి. ఈస్థితిలో రామన్న రాత్రి 9 గం. లకు యిల్లు చేరుకున్నాడు. శుభ్రంగా స్నానంచేసి, పొడి పంచకట్టుకుని, భోజనంచేసి, పడుకున్నాడు. కాని కాలువలో పడిపోయిన మూడు రూపాయల సంగతి తలచుకొంటూ రాత్రి నిద్రపోలేదు పాపం!

మర్నాటి ఉదయం రామన్న యింకా మంచంమీద నుంచి లేవకుండా సుబ్బావధాన్లు విభూతి పిండికట్లతో రామన్న యింటికొచ్చాడు. గడగడ వణుకుతూ రామన్న బయటికొచ్చి, సుబ్బావధాన్లకు నమస్కరించి, ఏదోచెప్పబోయాడు.

సుబ్బావధాన్లు: "ఏమోయి, రామన్నా? ఇంకా నిద్రపోతున్నావేమిటోయి. సోమరితనం అలవర్చుకుంటున్నావాయేం? సోమరితనానికి మించిన అపరాధం మరొకటి లేదుసుమా! ప్రపంచంలో పురుషజన్మఎత్తిన వారు ఉదయాస్తమానాలు చెమటూర్చి పనిచేయాలి. ఇప్పుడు 7 గంటలయింది. ఇంకా మంచంమీదే పడుకొనిఉన్నావా? రామన్నా, నేను చెప్పే యీమాటలు నీకు బాధకరంగా ఉండవచ్చు. కాని అవి నీ మంచికే చెపుతున్నానని మరచిపోకు!"

రామన్న: "తప్పేనండి, అవుధాన్లుగారూ! ఈసారికి క్షమించండి. ఎప్పుడూ నేను తెల్లవారకముందే లేస్తానండి. ఇక యెప్పుడూ ఆలస్యంగా లేవనండి." అని చేతులు నలుపుకుంటూ క్రిందటిరాత్రి జరిగిన వృత్తాంతం అంతా సుబ్బావధాన్లతో చెప్పాడు. రూపాయలు పోయినసంగతివిని సుబ్బావధాన్లు ఏమీ అనలేదు. ఆమూడు రూపాయలకు బదులు 30 రూపాయల విలువగల పనిచేయించుకొని, మరొక 30 రూపాయల కాయకూరలు పండ్లు వగైరాలు రామన్న దగ్గర తీసుకోవచ్చునని సంతోషించాడు.

సుబ్బావధాన్లు: "రామన్నా, అట్టేవిచారించకు! సొమ్ముపోతే నేమిలే! తనువే శాశ్వతంకానప్పుడు సొమ్ము శాశ్వతమా? సరేకాని, రామన్నా, రాత్రికురిసిన వర్షపునీరు మాయింటిపెరట్లో నిలిచిఉన్నదోయి! నీరు అవిధంగానిలిస్తే పిల్లలకి జబ్బులుచేస్తాయి. కనుక, నీవొకసారి వచ్చి సహాయ పడితివా...."

రామన్న: "ఎంతమాటండి, అవుధాన్లుగారూ! తప్పకుండా వస్తా! కాని ఒకఅర్ధగంట నన్ను తమరు వదలాలి. అపూరిగుడిసె యెట్లా చీకిపోయిందో చూడండి బాబయ్యా! రాత్రి వంటింట్లో అంతా వర్షమేనండి! ఆకన్నంతాన్ని కప్పెట్టి ఒక్క పరుగున వస్తా!"

సుబ్బావధాన్లు: "సరే, రామన్నా! నీవవిచూసుకో, నేనే చేసుకుంటాలే ఆకాస్తపనీ. నిన్నటి సంతబేరం కాలూరు సొమ్ము తీసుకుపోదామనివస్తే ఉత్తచేతుల్తో తిరిగి పోవాలవివచ్చింది కదా! సరే, ఏంచేస్తాం! ఆపరమాత్మకు నామీద యింతేదయ కాబోలు!"

రామన్న యీ మాటలువిని, వినయంగా నమస్కరించి, క్షమార్పణ వేడుకొన్నాడు. వెంటనే తన యింట్లోకి పోయి, నోట్లో నీళ్ళుపుక్కిలించి వుమ్మేసి,సుబ్బావధాన్లతో నడవటం మొదలెట్టాడు. ఇద్దరూ సుబ్బావధాన్ల యిల్లు చేరుకున్నారు. వెంటనే పార చేత్తో పుచ్చుకొని రామన్న పని ప్రారంభించాడు. గత రాత్రి శరీరం వర్షంలోనాని నొప్పులుగా ఉన్నప్పటికీ పార చేతినుండి విడువక పనిచేశాడు పాపం.

సుబ్బావధాన్లు: "భేష్, రామన్నా! పరోపకారంలో పురుషుడెంత ఆనందం అనుభవించగలడు! ఇక నీవింటికిపోయి విశ్రాంతి తీసుకో! ఎందువల్లనంటే, రేపు ఉదయాన్ని మావకుప్పల్ని ఒకసారి బీటికి తోలుకెళ్ళాలి."

ఇంచుమించు ప్రతిదినం సుబ్బావధాన్లు రామన్న దగ్గిరికొచ్చి, వేదాంతాన్ని గురించి బోధిస్తూ ఉండేవాడు, రామన్న పరవశుడై వింటూఉండేవాడు. ఒకనాడతడు యీవిధంగా ప్రశ్నించాడు.

"అయితే, అవుధాన్లుగారూ! ఈ లోకంలో కొందర్ని ధనికులు గాను మరికొందర్ని బీదలు గాను కొందర్ని భోగులు గాను మరికొందర్ని రోగులు గాను పుట్టిస్తా రెందుకండి, పరమాత్మ?"

సుబ్బావధాన్లు: "రామన్నా, విను. గీతలో శ్రీకృష్ణ భగవానుడు,

'అవశ్యమనుభోక్తవ్యం। కృతంకర్మ శుభాశుభం'

అని స్పష్టంగా చెప్పియున్నాడు. అనగా, ఎట్టివారికైనను పూర్వ కర్మఫల మనుభవింపక తప్పదని అర్థము. జీవులకు నానావిధములగు ఉత్కృష్ట,నికృష్ట జన్మములు కలుగుటకు కారణము మనుష్య జన్మయందు చేయబడిన పుణ్య పాపములే। ఈ జన్మమునందు పరమాత్మను పూజింపక, కామ క్రోధాది అరిషడ్వర్గములకు లోనై కాలమును వృధాపుచ్చిన యెడల మనుజుడు పశుప్రాయుడై నీచ జన్మను చేపట్టును. అట్లు గాక, సాధు గోష్ఠిని చేరి, శాంతి సుఖము లనుభవించుట మనుష్య జన్మమునకు ప్రయోజనము. కనుక, పేద జనులు యీ జన్మమందు అరిషడ్వర్గము లను దరి చేరనీయక, సదా ఈశ్వరునియందే మనస్సు నిలిపి కాలము గడిపిన యెడల, వచ్చే జన్మలో ఐశ్వర్యవంతులుగా జన్మింపగలరు."

★

ఒకనాడు రాత్రి రామన్న భోజనం చేసి మంచం మీద కూచున్నాడు. ఆకాశం అంతా గాఢమైన మబ్బులతో నిండి ఉంది. విపరీతమైన గాలి ఆ చిన్న గుడిసెను యిటూ అటూ ఊపివేస్తుంది. అట్టి సమయంలో యింటి తలుపు చప్పుడయింది. మొదట గాలి యొక్క శబ్దం అనుకున్నాడు. కాని, రెండోసారి యింకా గట్టిగా శబ్దం అయింది.

( మిగతా 5 వ పేజీలో )



# స్పెయిన్ కు బ్రిటన్ ఫ్రాంసు సామ్రాజ్యాలు చేస్తున్న మహాద్రోహం ★



## ★ ధనికుల, జమీందారుల, మతాధికారుల కుట్రలు ★

స్పెయిన్‌లో జరుగుచున్న యుద్ధం స్పెయిన్ ప్రజాప్రభుత్వముమీద ఫాసిస్టులు చేస్తున్న తిరుగుబాటు ఈతిరుగుబాటు నణచివేయుటకు ప్రజాప్రభుత్వము సల్పుచున్న పోరాటము అని అందరు తెలుసుకొనవలెను. ఎందుకనగా, ప్రజాప్రభుత్వము అన్యాయముగా అధికారం సంపాదించలేదు. 1936 మార్చిలో దేశమంతా జరిగిన ఎన్నికలలో, న్యాయసమ్మతముగా అధిక సంఖ్యాకులుగా ప్రజాపక్ష సమ్మేళనం అధికారంలోకి వచ్చింది. వెంటనే ప్రజాసామాన్యమున కనుకూలమగు కార్యక్రమము నమలుపరచుటయే ఈతిరుగుబాటుకు కారణం. స్పెయిన్‌లోని ధనికవర్గం, భూస్వాములు, జమీందారులు, కాథలిక్ చర్చికలసి, జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశముల సహాయంతో ప్రజాస్వామికమును నాశనం గావించుటకు చేయుచున్న దేశద్రోహమే ఈతిరుగుబాటు.

ఈతిరుగుబాటు మొదట జూలై 17 వ తేదీన ఫ్రాంకో నాయకత్వంక్రింద మొరాకోలో ఆరంభమయింది. ఒక్క రోజులో స్పెయిన్ దేశమునకు ప్రాకింది. అంతకు పూర్వమే, (10 నెలలక్రిందట ఈవిరంకుశవర్గం అధికారంలో ఉన్నప్పుడు) బాహ్యమైన తిరుగుబాటు ప్రయత్నములు రహస్యముగా దేశమంతా, చేసియుంచుటవల్ల, బార్సిలోనా, సెవిల్, బర్గోస్, కానరీద్వీపాల్లోను, ఇంకా స్పెయిన్‌లోని ముఖ్యనగరముల యందలి సైన్యంమీద ఒక్కమాటుగా తిరుగుబాటు చేయుటకు వీలయింది. దేశములోని సైన్యములో నూటికి 90 వంతులు ఫాసిస్టు విద్రోహులపక్షం చేరింది. నావికాబలము, విమానబలము మట్టుకు ప్రజాప్రభుత్వము వైపునే విశ్వాసముగా నిలచిపోయినవి.

ఈతిరుగుబాటు చేస్తున్న ధనిక, మితవాదవర్గాలు దేశములోని ప్రజాపక్షములబలం, విప్లవవాదముల యొక్క తీవ్రప్రచారం, దినదినం అభివృద్ధిఅయిన సాంఘిక విప్లవమును, సరిగా అర్థంచేసుకొనలేదు. వారు ఒక్క 15 రోజులలో ప్రజాప్రభుత్వమును కూలద్రోయగలమని అనుకున్నారు. స్పానిషు యుద్ధమంతా ఈభ్రమమీద ఆధారపడి యున్నది.

తిరుగుబాటు ప్రారంభమైన వెంటనే, ప్రజలందరికి ఆయుధములు సప్లయిచేసి, యుద్ధసన్నద్ధులుగా చేయుటకు ప్రజాప్రభుత్వం తీర్మానించింది. ఈఎత్తు, యుద్ధ దృక్పథమునుంచి ప్రజాప్రభుత్వమునకు అత్యవసరమేగాక, రాజకీయంగా, ప్రజాప్రభుత్వంమీద ప్రజలకున్న నమ్మకాన్ని ఎక్కువచేసి, ఉత్సాహపూరితులుగాచేసింది. ఇదేగాక, కాథలిక్ మతాన్ని రక్షించుటకొరకు మొరాకోనుంచి వచ్చిన మహమ్మదీయ సైనికులను, ఇటలీ, జర్మనీలనుంచి వచ్చిన విదేశ సైనికులను చూసి, ఫ్రాంకో ఫాసిస్టు పక్షంమీద అసహ్యం, వైరం ఎక్కువై, ప్రజాప్రభుత్వమునకు సానుభూతి, బలం అభివృద్ధి అయింది. ఈరోజు స్పానిషు ప్రజా స్వామికమునకు కున్న బలం, ఇంతవరకూ స్పెయిన్‌లో ఏకాలమందుగూడ లేదు.

1936 జూలై 18 మొదలు, సెప్టెంబరు 31 వ తేదీ వరకు 400,000 యుద్ధంలో మరణించినట్లు తెలుస్తుంది (Sunday Express 11-10-36) దీనిని బట్టి విద్రోహులు ఎంత ఘోరమైన పద్ధతులవల్ల మారణయంత్రములను, బాంబులను ప్రయోగించారో తెలుస్తుంది. విద్రోహులు ఒక్కబాడ్జాజ్ పట్టణమును గెలచినప్పుడు, 1500 మంది గవర్నమెంటు సైనికులను ఉరితీశారు. ఈపరిస్థితులలో, ప్రజాప్రభుత్వాధ్యక్షుడగు అజానా చాలసమర్థుడైనప్పటికి, ఎక్కువ తీవ్రవాది కాకపోవుటవల్ల, కార్మిక నాయకుడగు కబల్లారో ప్రధాన మంత్రిత్వముక్రింద, నూతన, తీవ్రవాద మంత్రిత్వము ఏర్పరుచబడెను. కబల్లారోను, స్పెయిన్ యొక్క లెనిన్ అని అందరు పిలచేవారు.

**తటస్థవిధానం—ప్రజాప్రభుత్వమునకు ఇతర దేశాలు చేసినద్రోహం**

1936 అగస్టు 1 వ తేదీన తటస్థవిధాన సిద్ధాంతమును బయలుదేర దీసింది ఫ్రాంసు. స్పెయినులో ప్రజాస్వామికమునకు, ఫాసిజమునకు జరుగుచున్న యుద్ధం యూరపు ఖండమంత ప్రాకి గొప్ప యూరపు సంగ్రామముగా మారవచ్చునని అనుమానం యూరపులో ఎక్కువైంది. ఇదేగాక ఇటలీ, జర్మనీల సహా

( మిగతా 12 వ పేజీలో )

## వైరాగ్య కాంక్ష.

( 4 వ పేజీ తరువాయి )

"ఎవరో దారి తప్పిన ప్రయాణీకుడు కాబోలు" అనుకుంటూ రామన్న మంచం మీదనుంచి లేచి వచ్చి తలుపు తీశాడు. సుబ్బావధాన్లు ఒక చేతిలో లాంతరు రెండో చేతిలో గొడుగు పట్టుకుని తలుపు దగ్గర నిలబడ్డాడు.

సుబ్బావధాన్లు: "చూడు, రామన్నా! మా ఆఖరి కుర్రాడు కడుపు నొప్పిచేత చాలా బాధపడుతున్నాడోయి! నేను వైద్యుణ్ణి తీసుకురావడం కోసం వెడుతున్నాన్లే. కాని, నాకంటె నువ్వెడితే పని యింకా త్వరగా అవుతుంది. ఇప్పుడే తోచింది యీ ఆలోచన! కనుక, రామన్నా, ఒకసారి వెళ్ళివైద్యుణ్ణి తీసుకు రావూ?"

రామన్న: "ఈ మాత్రపు పని కింత ఆలోచన ఎందుకు అవుదోన్లు గారూ? ఇప్పుడే పోయి తీసుకొస్తా!" అని పైమీద కండువా వేసుకొని, కాళ్ళకు జోడు తొడిగి బయల్దేరాడు.

రామన్న: "అవుదోన్లు గారూ, ఎంత చీకటిగా ఉన్నదండి! ఒక్కసారి ఆ లాంతరు యిచ్చారంటే ఓ అరగంటలో వైద్యుడి దగ్గర కెళ్ళి వచ్చి మళ్లా మీకిచ్చేస్తా!"

సుబ్బావధాన్లు: "రామన్నా, లాంతరు నీ కివ్వడానికి అభ్యంతరం ఏమీ లేదు. గాని, ఇది కొత్తది. మొన్ననే కొనుక్కొచ్చా. రెండో వాళ్ళ కియ్యకూడదని అనుకున్నా! అంతే గాని మరో ఉద్దేశం లేదు! లాంతరు లేకపోయినప్పటికీ ఆ కరుణామయుడు నీకు దారి చూపకపోతాడా, రామన్నా?"

వెంటనే రామన్న బయల్దేరాడు. ఆ గ్రామానికి రెండు మైళ్ళ దూరంలో ఉండే మరొక వూళ్ళో ఉన్నాడు వైద్యుడు. రామన్న చీకట్లో నెమ్మదిగా అక్కడికెళ్ళి వైద్యుడితో కబురు చెప్పాడు. వెంటనే వైద్యుడు జట్కాబండిమీద ప్రయాణమై సుబ్బావధాన్ల దగ్గర కెళ్లాడు. రామన్నకి మాత్రం మళ్ళీ కాలినడకే గతి అయింది. చీకటి యధాప్రకారంగానే ఉంది. దానికి తోడు గాలి, మబ్బు, ఉరుములు ప్రారంభమయాయి. రామన్నకు గుండెలో దడ ప్రారంభమైంది. చీకట్లో కన్ను గానక దారి తప్పిపోయాడు. కాళ్ళలో ముళ్లు గుచ్చుకున్నాయి. డొంకలు, పొదలు ఎక్కువగా ఉండే ప్రదేశంలో నడుస్తున్నాడు. అంత కంతకు యిల్లు దూరమౌతోంది గాని దగ్గర కొచ్చేటట్లు కనపడ్డం లేదు. వర్షం వొస్తుందనే భయంతోను, త్వరగా యిల్లు చేరుకుందామనే ఆశతోను చురుగ్గా నడవటం ప్రారంభించాడు. ఈతొందరలో నల్లత్రాచు ఒకటి అతని కాళ్ళలో పడింది పాపం. కంగారుపడి అటూ యిటూ గంతులేశాడు. ఆత్రాచు రామన్న కాలి మీద ఒకకాటు వేసి తప్పించుకు పోయింది. ఒక పొలికేక వేసి కింద పడిపోయాడు. రామన్న, వెంటనే స్పృహ తప్పిపోయింది అతనికి. త్వరలో ప్రాణంకూడా పోయింది. మర్నాటి ఉదయంవరకూ శవం అక్కడే పడిఉంది. కొంతమంది పశువుల కాపర్లు శవాన్ని చూచి గ్రామంలో చెప్పారు. గ్రామస్థులంతా ఆశ్చర్యపోయారు. అతని సుగుణాలను, స్వార్థత్యాగాన్ని అందరూ అనేకవిధాల పొగిడారు. ముఖ్యంగా, సుబ్బావధాన్లు అతని వైరాగ్యజీవితాన్ని విపులంగా వర్ణించాడు. ఊరికే పెట్టదాకరించేసే 'నిష్కామకర్ముడు' పోయాడని సుబ్బావధానులు లోలోన తపించాడు.

# హరిపుర కాంగ్రెస్ మహాసభకు ఇండియన్ కమ్యూనిస్టుల జేజేలు!

## ఫెడరేషన్‌ను అన్ని వైపుల నుండి ఎదుర్కోవాలి

## సంయుక్త జాతీయ సంఘటనా విధానం అవలంబించాలి

భారతదేశంలోను, ప్రపంచంలోను పోరాటం క్లిష్ట దశయందున్న రోజుల్లో సమావేశ మవుతూన్న హరిపుర జాతీయ మహాసభకు మా జే జేలు. నేటి క్లిష్ట పరిస్థితుల్లో దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారం వాయిదా వేసి పార్లమెంటరీ కార్యక్రమంతో తృప్తిచెంది సామ్రాజ్యవాదులతో రాజీకి దారి తీయక, జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడుతున్న ప్రజా శక్తు లన్నిటిని ఏకముఖానికి తెచ్చి, ఫెడరల్ విధానానికి, రాజ్యాంగ చట్టానికి వ్యతిరేకంగా పోరాటం సాగించే కార్యక్రమం మహాసభ నిర్ణయించాలి.

ఫైజపూర్‌లో మనం జాతీయ సంయుక్త ప్రతిఘటనా విధానం అవలంబించాము. హరిపూర్‌లో ఆ విధానం కొనసాగించుతూ ముందుకు దారితీయాలి.

తీవ్రగతిని క్లిష్టమగుచున్న ప్రపంచ పరిస్థితులలో మహాసభ ప్రజా పోరాటానికి, సంయుక్త జాతీయ ప్రతిఘటనకు అనుకూలంగా తీర్మానించాలి. ఫాసిస్టుల దుండగీడుతనం మితిమీరుతూంది. అబిసీనియా నుండి స్పెయిన్‌కు, స్పెయిను నుండి చీనాకు మారణ హోమంతో ఫాసిస్టుల ప్రతిభ వ్యాపిస్తూవుంది. సోవియట్ యూనియన్‌కు, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా మాత్రమేగాక, శాంతికి, ప్రజాస్వామికానికి, కాపిటలిస్టు దేశాలలో నానాట బలపడుతున్న సోషలిస్టులకు, బానిసదేశాల ప్రజా ఉద్యమాలకు వ్యతిరేకంగా ఫాసిస్టులు సంధిచేసికొన్నారు. ప్రతిదేశంలోనూ యుద్ధానికి తయారీ హెచ్చింది. పరిస్థితులు ఒక ప్రపంచ సంగ్రామానికి దారి తీస్తున్నాయి.

బ్రిటిషు సామ్రాజ్యవాదం సోషలిజానికి, బానిస దేశాల స్వాతంత్ర్యోద్యమానికి ప్రబల విరోధి. అందుచే ఫాసిస్టు దొంగలకు సహకారి. అయితే బ్రిటను తన సామ్రాజ్యాన్ని, కాలనీలను సోషలిస్టుల, విప్లవకారుల పలుకుబడినుండి, తన ఫాసిస్టు మిత్రుల దాహంనుండి కాపాడు కోవాలి. అందుకొరకే ఆయుధాలను హెచ్చిస్తూంది. నావికా కేంద్రాలను బలపరుస్తూంది. కాలనీలలో తన ప్రభుత్వమును కట్టు దిట్టం చేస్తూవుంది. పాలస్టైన్, యీజిప్టులలో స్వాతంత్ర్య నిరోధకులతో రాజీపడు జాతీయోద్యమాన్ని అణచి తన ప్రాచీన సామ్రాజ్యాన్ని కాపాడటానికి 'మిలిటరీ పోస్టు'లగా వినియోగించుకోవాలని ప్రయత్నిస్తూంది.

ఇండియాలో, బ్రిటిషు సామ్రాజ్యవాదులు, డిమాక్రసీ—అఖిలభారత సమాఖ్య- అని పెద్దకబుర్లుచెబుతూ, జాతీయ స్వాతంత్ర్య నిరోధకులతో రాజీకొరకు ప్రయత్నిస్తున్నారు. యుద్ధపరిస్థితులలో వారి సాయంతో 'అంతరంగిక శాంతి' (Internal Peace) కని ప్రజాశక్తులను అణచివేస్తుంది.

బ్రిటను, యుద్ధంకొరకు చేయు తయారీలో, ఇండియాలో ఫెడరేషను ప్రవేశపెట్టుట ఒక భాగం. బ్రిటనుకు, సింగపూర్ నౌకాశ్రయము, సైన్యాల మరామత్తు ఎంత అవసరమో ఫెడరేషను అమలుజరుపుట అంత అవసరం.

ఇపుడున్న క్లిష్ట పరిస్థితుల్లో బ్రిటను జాతీయ విద్రోహకుల సహాయంతోనే ఫెడరేషను అమలు జరుపలేదు. ప్రపంచయుద్ధం వస్తే భారతదేశంలో శాంతి అత్యవసరం బ్రిటనుకు. అందుచే జాతీయ ఉద్యమంలో ధనికవర్గాలతో రాజీపడి, పార్లమెంటరీ కార్యక్రమంతో సంతృప్తిపడేవారి సహకారం సంపాదించాలని ప్రయత్నిస్తూంది. కాంగ్రెసు మంత్రి వర్గాలున్న రాష్ట్రాలలో పరిపాలన ఒడిదుడుకులు లేకుండా సాగుటలో వారి ఆశలు గోచరించాయి. జాతీయ నాయకత్వంలో ఒక భాగం రాజీవైపు మ్రొగ్గుతూందని గమనించి, సామ్రాజ్యవాదులు, ఏమీ యివ్వకుండానే, 'పరోక్షపు ఎన్నికల, [Indirect Election] స్థానే ప్రత్యక్ష ఎన్నికలు [Direct Elections] మాత్రం ప్రసాదించి. నేషనల్ కాంగ్రెసు నాయకుల సహకారం సంపాదించి కాంగ్రెసు, సంస్థానాధిపతులు, కులతత్వవాదులు గల్గిన ఫెడరల్ మంత్రివర్గాన్ని నిర్మించాలని ఆశిస్తూంది. అంటే బానిస రాజ్యాంగాన్ని జయప్రదంగా అమలు జరుపాలనీ జాతీయ విద్రోహులకు జయం కూర్చి కాంగ్రెసులో చీలికలు తెచ్చి నాశనం కావించాలని సామ్రాజ్యవాదుల పన్నుగడ.

ఇది లోథియన్ ప్రభువు గంటున్న కల మాత్రమే కాదు. యుద్ధసమయంలో భారతదేశాన్ని ప్రధాన కేంద్రంగా ఉపయోగించుకోటానికి, జాతీయ పోరాటం కొనసాగిస్తున్న ప్రజా శక్తులను అణచివేయడానికి బ్రిటిషు సామ్రాజ్యం వేస్తున్న యెత్తు. ఈ యెత్తును మనం జయప్రదంగా ఎదిరించే విధానం నిర్ణయించుటే హరిపుర కాంగ్రెసు తేల్చవలసిన ప్రధాన సమస్య.

సామ్రాజ్యవాదులు జాతీయ ఐక్య సంఘటన కొనసాగిస్తూన్న ప్రజా శక్తులను చీల్చటానికి రహస్య ప్రయత్నాలు గావించుతున్నారు. ఎన్నికలకు పూర్వమే కార్మికుల సమ్మెలు, కిసాన్ సంఘాలు వృద్ధి పొందాయి.

ఫైజపూర్ కాంగ్రెస్ నిర్ణయాలు, ఎన్నికలు సామ్రాజ్య వ్యతిరేక జాతీయ శక్తులలో సంచలనం గల్గించాయి. ఫైజపూర్ ప్రజాస్వామిక ప్రభుత్వానికి, కాన్‌స్టిట్యుయెంట్ ఎసెంబ్లీ కొరకు, కార్మిక కర్షకుల కనీసపు హక్కుల కొరకు, ప్రజా సామాన్యం తోడ్పాటుతో రాజ్యాంగ చట్టాన్ని భగ్నం చేయడానికి తీర్మానించింది.

రాజీ కొరకు దేవులాడువారు ప్రచార తీవ్రతను తగ్గించినా, విప్లవ ప్రతి ఘాతకులతో రాజీ చేసికొన్నా, ఎన్నికలు స్వాతంత్ర్యం కోరేవా రందరి ఐక్యతను ఋజువు చేశాయి.

ఎన్నికలలో కాంగ్రెసు దిగ్విజయం, కార్మిక కర్షకులలో రాజకీయ పరిజ్ఞానం హెచ్చి, వారి ఆర్థిక పోరాటానికి రాజకీయ పోరాటంతో సంబంధం హెచ్చింది. (జూట్ వర్కర్సు జనరల్ సమ్మె). ఏప్రియల్ 1 వ తేదీ బానిస రాజ్యాంగాన్ని నిరసిస్తూ కార్మికులు సమ్మెలలో పాల్గొన్నారు. సమ్మెల ఫలితంగా కార్మిక సంఘాలు బలపడినాయి. కాన్పూరులో సభ్యత్వం 2 వేల నుండి 12 వేలకు పెరిగింది. రైతుసంఘాలు వృద్ధి పొందాయి(బీహారులోనే లక్షలకొలది సభ్యులున్నారు).

అతివాదుల, సోషలిస్టుల, కమ్యూనిస్టుల నాయకత్వం క్రింద కాంగ్రెసు కార్యక్రమం ఆచరణలో పెట్టడానికి, మంత్రులకు ప్రజాశక్తుల బలం చేకూర్చడానికి ఉద్యమం ప్రారంభమయింది. పదవీ స్వీకారం కొంత లొంగుబాటే అయినా ప్రజా పోరాటం, ఆందోళనం తీవ్రంగా వృద్ధి పొందుటచే పరిస్థితులను లాభకరంగా ఉపయోగించుకోవచ్చును.

రైతుల యాత్రలు: విద్యార్థుల సమ్మెలు, రాజకీయ ఖైదీల విడుదల కొరకు బ్రహ్మాండమైన ఉత్సవాలు, పోరాటాన్ని హెచ్చు స్థాయిలోకి గొనిపోయాయి.

ఇదివరకే పొందిన సౌకర్యాల వల్ల, మంత్రివర్గాలపై ప్రజల నమ్మకం హెచ్చి, వెనకబడిన తరగతుల ప్రజలు కూడ పోరాటంలోకి వస్తున్నారు. మారుమూల గ్రామాల్లో కూడ రైతుసంఘాలు ఏర్పడుతున్నాయి. కాంగ్రెసులో చేరుతున్నారు. తాతలనాటి నుండి అధికారం చలాయిస్తున్న 'తట్వారీ' 'కారిందా' లకు ఎదురు తిరుగుతున్నారు ( బీహార్, యు. పి. )

భారతదేశమంతటా యివే పరిస్థితులు. కష్టజీవులందరిలో చైతన్యం కలిగింది. ప్రజలంతా ఫైజపూర్ వాగ్దానాలను పూర్తిగా నమ్మారు. వాటిని సాధించటానికి ముందుకు సాగుతున్నారు. ఈశక్తులన్నిటిని సంఘటనం చేసి, వారిబలంతో ఫెడరేషను భగ్నం చేయడానికి కాంగ్రెసు నాయకత్వం వహించాలి.

ఈఐదుమాసాల కాంగ్రెసు మంత్రుల హయాంలో చెలరేగిన తుపాను జాతీయ విద్రోహులకు భీతికల్గించింది. వారు ఉద్యమాన్ని, కార్మికకర్షక సంఘాలతో కాంగ్రెసుకున్న సంబంధాన్ని త్రుంచివేయడానికి ప్రయత్నిస్తున్నారు. మిల్లు యజమాన్లు కార్మికసంఘాల నణచుటకు, జమీందార్లు రైతులఆందోళన నాశనం గావించుటకు, కాంగ్రెసుమంత్రులను తమ కనుకూలంగా ఉపయోగించు కోవాలని ప్రయత్నిస్తున్నారు.

(మిగతా 11 వ పేజీలో)



# నేటి ప్రపంచం

★ జర్మనీలో తిరుగుబాటా ?

★ జపాన్ జవాబు

★ రుమేనియాలో ఫాసిస్టుపతనం

### జర్మనీలో తిరుగుబాటా ?

సైనికాధిపతుల మార్పులవల్ల హిట్లరుకు—నాజీపార్టీకి అడ్డంకులు తీరినవని క్రిందటివారం చెప్పాము. కాని హిట్లర్ తలచినట్లూ— మనము ఊహించినట్లూ అంత సులభంగా తేలలేదు ఈవ్యవహారం. జర్మనీలో తిరుగుబాటు జరిగిందని విదేశవార్తల వదంతులు.

బెర్లిన్ పూర్వ రాజకుమారుడు 'సెలవు' మీద ఇటలీకి ఫిబ్రవరి 5 వ తేదీన వెళ్లాడు. అక్కడనుంచి ఆయన పారిపోయాడు. వీధులలో అరాచకం జరుగుతున్నదని అధికార్లలో హడలు పుట్టింది. ఇదేసమయమని కార్మికులు తిరగబడతారేమో నని అప్రాంతాల తిరిగారు. కాని అక్కడ శాంతంగానే ఉన్నది.

ఇక సరిహద్దులలో అంతా పకడ్బంద్' చేశారట: 'బెల్గో-జర్మనీ' సరిహద్దునీ, 'ఆస్ట్రో-జర్మనీ' సరిహద్దునీ మూసివేశారట. 'సైరల్' సరిహద్దులో బాగా శోధించిన తర్వాతగాని ఎవరినీ వదలటం లేదట: బెల్జియన్ సరిహద్దులలో పోలీసులను రెట్టింపు కావించారట: స్టాల్ప్-అల్లెన్‌స్లీన్ నగరాలలో ప్రష్యన్ సైనికులు తిరుగుబాటు చేశారుట:....ఇవన్నీ వదంతులు.

ఈవార్తలన్నీ అబద్ధమంటూ విదేశ పత్రికా ప్రతినిధులకు ప్రచారకమంత్రి గారు సెలవిచ్చారు. కాని విదేశ పత్రికలన్నిటినీ పట్టుకొని దేశంలో ప్రచారంకాకుండా ఆపివేశారు. జర్మనీలోని పత్రికలన్నీ మౌన ముద్రవహించినయి. ఇదంతాచూస్తే దీని వెంవెనుక నాటకం ఏదో ఉందని తోస్తుంది.

జర్మనీ సైనికులగురించి చెప్పేటప్పుడు వారి సాంప్రదాయాలు కూడా తెలిసికోవడం అవసరం. తక్కిన దేశాలలాగా సైనికులువేరు- రాజకీయాలు వేరుగాదు జర్మనీలో. ఇప్పటి జపానులో లాగానే రాజకీయాలలో ఇంతో అంతో జోక్యం మిలటరీ ఆఫీసర్ల కుంటుంది. స్వాభిమానం అహంకారంతోపడి చస్తారు ప్రష్యాసైనికులు. వారి గౌరవానికి ఏమాత్రం కించ గల్గించినా సమ్మతించరు. ఇలాంటి 'పూర్వపు భావాలు'గల వాళ్ళు జర్మనీలో చాలామంది ఉన్నారు. వీళ్ళకి జర్మనీ 'రీచ్' (పార్లమెంటువంటిది) లో గూడా పలుకుబడి ఉన్నది. అందుకనే 'రీచ్'కు హిట్లర్‌పార్టీయగు 'నాజీపార్టీ'కి అనేకసార్లు విభేదాలు కల్గినయి. పైన చెప్పిన రీచ్ లోని కొందరికి 'రాచరిక' వ్యామోహం, భూస్వామ్య నిరంకుశవాసనలూ పోలేదు. హిట్లరును పెద్దజేసిన పెట్టుబడిదారులకు 'రాచరికం-భూస్వామ్యం' వాసన ఏమీ గిట్టదు. ఇటు కార్మికులు- జనసామాన్యమూ తిరగబడరాదు. అందుచేత మొదట కార్మికులను ప్రజాస్వామ్యాన్ని అణచారు. రాచరికం లేకపోయినా ఆవాసనలున్న సైనికాధి పతులను తొలగించడానికి కారణం ఇదే. వీరినే తొలగించే 'రీచ్' ఇక తనకు అడ్డుచెప్పదు. రీచ్ అడ్డుచెప్పడంవల్లనే ఇటలీలాగ బహిరంగంగా తగినంత సహాయం ఫ్రాంకోకు చేయలేక పోయాడు హిట్లర్. ఇంకో ముఖ్యవిషయం సోవియటురష్యాపైదాడి. హిట్లర్ అధికారానికి వచ్చినా జర్మనీ రష్యాతో 1926 లో చేసికొన్న "రాపల్లో" సంధి ఇంకా అలాగేఉంది. ఆర్థికంగా కృంగిపొయ్యే జర్మనీని ప్రపంచయుద్ధంలోకి దింపవద్దని, సోవియటు రష్యాయొక్క- యుక్రయిన్‌పై దండెత్త దలచడం ఆత్మవినాశనమూ, తెలివితక్కువా అని 'రీచ్' లోని ప్రష్యా సైనికాధికారుల అభిప్రాయం. ఇలా మాటిమాటికి అడ్డువచ్చే వీరిని తొలగించితేగాని లాభంలేదని ఈమార్పులు గావించారు. కాని అనుకున్నంత సాఫీగా జరగలేదు. తిరుగుబాటు కల్గింది. ఈతగాదాయే హెచ్చి తీవ్రఘర్షణ జరిగితే మళ్ళా ఒక్కసారి ప్రజాస్వామ్య శక్తులు విజృంభించడానికి అవకాశం ఉండేది.

బ్రిటన్ ఫ్రాంసులలో లాగే సైనికులలో కురవ్రాళ్ళను నియమించు తున్నామని, బ్లాంబర్గ్ వివాహసమస్య ప్రైవేట్ విషయమనీ, అనారోగ్యంవల్ల వారందరు విశ్రాంతి తీసుకొన్నారనీ ప్రచారక మంత్రి ఎంతకళ్ళల్లో దుమ్ము కొట్టదలచినా లాభంలేదు. బ్లాంబర్గును కొన్నాళ్లు జర్మనీకి బయట నివసించేటట్టు చేయడానికికూడ కారణం అదే.

ఇంటిలోనిరచ్చ ఇలాఉంటే, బయట ఆస్ట్రియా జర్మనీలకు ఏవో రాయబారాలు జరుగుచున్నాయి. ఆస్ట్రియా అనగానే ముస్సోలినీకూడా తనతల ఎత్తుతాడు. జర్మనీకి అనుకూలంగా ఏమైనా, ఆస్ట్రో-జర్మనీసంధియే గనక సంభవించితే 'కమ్యునిస్టు ప్రతికూల ఫాసిస్టు ఉద్యమం' ఇంకా గట్టిపడుతుంది.

### జపాన్ జవాబు

నౌకా నిర్మాణం రహస్యంగా చేస్తున్నందుకు అసమ్మతిని తెలుపుతూ ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికాదేశాలు కారణం తెలియజేయమని అడిగినవి. ఇలా అడగటం నిర్హేతుకమైన దని జపాను యుద్ధమంత్రి అన్నాడు. ప్రభుత్వ ప్రకటనలో గూడ జపాన్ తాను తెలియజేయనవసరం లేదని తెలిపింది. ఇదివరకు జరిగిన 'దురదృష్ట' ఘటనలకు చింతిల్లుతున్నదట. న్యాయమైన సంప్రదింపులకు తయారేనట; జపాన్‌ను వదలి తక్కిన దేశాలు ఆయుధసామగ్రి పెంచితే, తన 'ప్లాను'తాను చూసుకొంటుందట. పైగా జపాను ప్రజ లందరూ ఏకమై తమను 'రక్షించు'కొంటారట. ఇంతే గాదు. రష్యా నౌకా నిర్మాణము—ఆయుధ బలమును చూచియే తాను ఈ పను లన్నీ చేస్తున్నదట. నిజమే. చరిత్ర తిరగ వేద్దాం.

జపాన్ ఆత్మరక్షణకోసం'కొరియా'ను కాజేసింది. లేకపోతేఎవరైనా ఆదేశాన్ని జయించి జపాన్‌కు ముప్పు తేవచ్చునని. కొరియా, మంచూరియాలు దగ్గరగా ఉండటం వల్ల, కొరియాకు ముప్పు వస్తుందని మంచూరియా కాజేసింది. జెహోల్, ఇన్నర్ మంగోలియాలు కూడ మంచూరియాను రక్షించుటకొనేందుకు దిగమ్రింగింది. ఉత్తరచైనా, ఈ పైప్రదేశాలకు ముప్పు వాటిల్లజేసేటట్లు ఉంది గనుక ఉత్తరచైనాలో ఈ యుద్ధం ప్రారంభమయింది. ఇలా చైనాలో జయించుకొంటూపోయిన ప్రదేశాలను రక్షించుకొనేందుకు ఇతర దేశాలను జయించాలి. ఈ దాకికి అంతెప్పుడు ? 'ఆత్మరక్షణ'కు అంతు ఎప్పుడు ? జపాన్ సామ్రాజ్యవాదం—ఫేసిజం అడుగంటినపుడే. ఈ రెండు తత్వాలు ఉన్నన్నాళ్లు, 'ఆత్మరక్షణా' కావాలి, 'రష్యా'భయమూ ఉంటుంది. ఇలాంటి భయంవల్లనే జపాన్ అధికారులు మంచూరియాలో మార్చినుండి నవంబరులోగా 482 మందిని అరెస్టు చేశారు. 85 మందికి ఉరిశిక్ష విధించారు. 64 మందికి కఠినపరకపు శిక్షలు విధించారు. ఇంకా 135 మంది విచారణలో నుంచారు. ఫేసిస్టుల చేత కార్మిక కర్షక నాయకులగు కమ్యూనిస్టులకు ఇంతకంటె బహుమతి ఎట్లు సంభవిస్తుంది. ఈ దారుణహత్యలు ఆపడానికి....

### రుమేనియాలో ఫాసిస్టు పతనం

రుమేనియాలో సోవియట్‌రష్యారాయబారి మాయమయ్యాడు. 8 వ తేదీనుండి కన్పడటంలేదు. దీనికి కారణం హత్య గావింపబడ్డాడనే తెలుస్తుంది. ఈవిషయమై రష్యా రుమేనియాకు గట్టిగా అసమ్మతి తెలిపింది. బెదరించిందికూడా. దీనితో ఆదేశంలో పెద్దమార్పుజరిగింది.

రుమేనియాలో ఈమధ్యనే ఫాసిస్టు ప్రభుత్వం ఏర్పడింది. ఇది ఇప్పుడు రద్దయింది. దానిస్థానే నూతన మంత్రివర్గాన్ని రాజా ఎన్నుకొన్నాడు. ఆమంత్రివర్గంలో పూర్వపు ప్రధానామాత్యులంతా ఉన్నారు, కాని ఫేసిస్టు సహకారి అయిన 'గోగా' లేడు. నూతన మంత్రివర్గంయొక్క ఆశయం "రాజు-దేశం" అట:

కాని రుమేనియాస్థితి ఇంతటితో బాగుపడిందని చెప్పడానికి వీలులేదు. పూర్తిగా ఫేసిస్టులనణచి, ప్రజాస్వామ్య దేశాలతో సహకారంతో ఉంటేతప్ప లేకపోతే త్వరలోనే ఇది ఒక స్పెయిన్ అయినా కావచ్చు. లేకపోతే ఫేసిస్టులకు పూర్తిగా లొంగిన దేశమయినా కావచ్చు.

# నవశక్తి

16—2—38 బుధవారము

## హరిపుర కాంగ్రెస్

హరిపుర కాంగ్రెసు మహాసభా నిర్ణయాలపై నాధారపడియున్నది దేశంలోని భావి స్వాతంత్ర్య పోరాటము. అందుచే దేశీయులందరూ యేమి మార్గము, కాంగ్రెసు మహాసభ యీ సారి చూపిస్తుందో యని యెదురు చూస్తున్నారు. అంతర్జాతీయ పరిస్థితులపై నాధారపడి యుంది భారతదేశ సమస్య యని జవహరు సుభాష్‌చంద్రులిద్దరు ఐకమత్యంతో అన్నమాట అక్షరాలా నిజము. దేశ పరిస్థితులను ప్రపంచపరిస్థితులతో సమన్వయం చేసుకొని కర్తవ్యాన్ని నిర్ణయించుకోవాలి.

యుద్ధానికి తయారవుతున్నాయి ఫాసిస్టు దేశాలు. యూరపులో మధ్యభాగమంతా ఫేసిస్టు రాజ్యాలమయమై పోయింది. అబ్సీనియా, స్పెయిను, చైనా దేశములలో ఫేసిస్టు రాజ్యముల దుండగీతనము మితిమీరిపోతోంది. తటస్థ భావాన్ని పైకి నటిస్తూన్నా యింగ్లండుకూడా యుద్ధానికి తయారవుతోంది. అందుచే మారణ యంత్రాలను హెచ్చించి నావికా కేంద్రములను బలపరచుకొంటూన్నది. తనక్రిందనున్న కాలనీలలో ప్రభుత్వాలను కట్టు దిట్టం చేస్తోంది. ఎన్ని చేసినా భారత దేశంలో సుముఖ వాతావరణాన్ని యేర్పాటు చేస్తేనేగాని లాభం లేదు. భారతదేశాన్ని యుద్ధంలో యెంతయెక్కువగా ఉపయోగించ గల్గితే అంత బలం యింగ్లాండుకు.

ఫెడరేషనును సాధనంగా ఉపయోగిస్తున్నారు బ్రిటిషు సామ్రాజ్యవాదులు భారతదేశంలో అనుకూల వాతావరణం కలుగచేయుటానికి. స్వదేశ ప్రభువులను పూర్తిగా యుద్ధంలో ఉపయోగించుకోగల్గితేనే వారికి తగిన సాయం లభిస్తుంది. అందుచే సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యము శూన్యం ఫెడరేషనులో. బ్రిటిషు యిండియాలో జాతీయ నాయకులు తృప్తిపడితేనేగాని సహాయముకాదు సామ్రాజ్యవాదులకు. అందుచే జాతీయవాద నాయకులను చేరదీయాలి. విప్లవశక్తులను అణచివేయాలి. సంస్థానప్రజలను, బ్రిటిషు యిండియాలోని విప్లవశక్తులను అణచివేసి, స్వదేశ ప్రభువుల సహాయమును, జాతీయవాద నాయకుల సానుభూతిని పొందిననాడు నిజముగా రవి యస్తమింపదు బ్రిటిషు సామ్రాజ్యముపైనని వారి విశ్వాసము. ఫెడరేషన్‌లో స్వదేశ ప్రభువుల ప్రతినిధులను జాతీయవాద నాయకులను (బ్రిటిషు యిండియా ప్రజల ప్రతినిధులను) కలిపి నిలుపగలిగిననాడు బ్రిటిషు సామ్రాజ్యవాదుల ఆశయములు ఫలించి తీరును. ఇది ఫెడరేషనులోని అంతరార్థం. ఇదెట్లు సాధ్యము? అనునది బుద్ధిమంతులయిన బ్రిటిషు రాజనీతిజ్ఞుల ఆలోచన.

ఈ ప్రమాదము నరికట్టు టెట్లు అనునది భారత స్వాతంత్ర్య యోధులను వేధించుచున్న సమస్య.

ఇంతవరకు కాంగ్రెసువైఖరి యుద్ధము, ఫెడరేషనులపట్ల తృప్తికరముగానే ఉన్నది. కాని నాయకుల ధోరణిమాత్రం అనుమానాలకి తావిస్తోంది. ఈ అనుమానాలన్నిటిని పారద్రోలి కర్తవ్యాన్ని మరోమారు స్పష్టంగా నిర్ణయించాలి.

లోథియను ప్రభువు వచ్చి నాయకులను దర్శించి వారికి కొన్ని తాళాలు లిచ్చి వెళ్ళిపోయాడు. రాష్ట్రాలలో లాగే కొంత యిచ్చిపుచ్చుకొనే పద్ధతిని సూచించి మాత్రం వెళ్ళిపోయాడు. పార్లమెంటులో బ్రిటిష్ ప్రధాని ఫెడరేషనులో కొన్ని సవరణలు చేయబడుననువదంతి నిరాధారమన్నారు. ఫెడరేషనును చీల్చి చెండాడుతా మంటున్నారు సుభాస్ జవహరులు. అయినా యితర పెద్ద నాయకులు మౌనముద్ర వహిస్తూన్నారు. లక్నో, ఫైజిపూరులలో సరిగ్గా యిదే విధంగా పదవీస్వీకారాన్ని గూర్చి మహాత్ముడు వల్లభాయి ప్రభృతులు బెల్లంకొట్టిన రాళ్ళవలె కదలకుండా కూర్చున్నారు. మైసూర్ ప్రభుత్వ నిర్బంధాలను గూర్చి ఆలిండియా కాంగ్రెస్ కమిటీ చేసిన తీర్మానాన్ని త్రోసిరాజని బహిరంగంగా ఖండించడానికి ఆదుర్దా చూపిన మహాత్ముడు ఫెడరేషనుపై నొక్క మాటయైనా ఆడడు. పైగా స్వదేశీ సంస్థానాలలోని ప్రజాపోరాటంతో సంబంధం లేదని వర్కింగుకమిటీ వారొక్క కలంపోటుతో కొట్టేశారు. కాంగ్రెసు సంఘాలే పనికిరావన్నారు అచ్చట. మైసూర్ ప్రభుత్వం జాతీయ జండాను కాలికింద పడేసి తొక్కివేస్తూంటే ప్రభుత్వ ఆతిధ్యాన్ని కాని పుచ్చుకోనన్నాడు రాజాజీ. దేశము సంపూర్ణ సమగ్ర, స్వాతంత్ర్యపోరాటానికి తయారగుచున్నది. రైతుయాత్రలు, కూలీ విద్యార్థి సమ్మెలు మహిళాసభలు విప్లవ నినాదాన్ని ప్రయోగిస్తున్నాయి. ప్రచండమైన పోరాటాన్ని ఫెడరేషను సమస్యపై సాగించడానికి సిద్ధంగా నున్నాయి ప్రజాశక్తులన్ని. కాని రాజీవద్ధతులచే మితవాద జాతీయనాయకులను చేరదీయుటకు సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. అతివాద శక్తుల నణచుటకు కూడ అమితమైన ఆవేశన పడుతున్నారు.

కాంగ్రెసు మహాసభ హరిపురంలో సమాధానమార్గాన్ని విడనాడి స్వాతంత్ర్యసమరనినాదాన్ని ప్రయోగించునని ఆశిస్తున్నాము. స్వాతంత్ర్యయోధుడగు సుభాష్‌చంద్రుని అధ్యక్షతన్న సమరశంఖారావంచే స్వాతంత్ర్య ప్రియుల చెవులు గింగురు మంటాయని నమ్ముతున్నాం. కావలసింది సమాధానంకాదు. సమరం, సమగ్ర, సర్వతోముఖ, సార్వజనిక, స్వాతంత్ర్య సమరం.

### పోయినది.

డైరీలు, పుస్తకములుగల ఎర్రసంచి,

అన్నపూర్ణయ్యగారి విజ్ఞప్తి.

ఈనెల 6 వ తేదీ ఆదివారం రాత్రి 10 గం 20 ని॥ల ప్యాసెంజరులో కాకినాడనుంచి రాజమండ్రికి వస్తుండగా నేను పొరపాటున ఎర్రసంచిని (వాలంటీరు) యొకనితో జారవిడిచితిని. కాకినాడ, సామర్లకోట, ప్లాటుఫారముల మీదగాని, రైలులోగాని అదిపడి యుండవచ్చును. అందు కొ డైరీలు, లెక్కలపుస్తకము, మున్నగు అమూల్యములైన వస్తువులు గలవు. ఇతరులకవి పనికిరావు. నాకు అమూల్యములైనవి. అవి యెవరికైన దొరికినచో నాకు అందజేసిన యెడల చాలకృతజ్ఞుడను. పంపుటకగు ఛార్జీలు నేనే భరించుకొందును. శ్రమకు మన్నింప గోరెదను.

రాజమండ్రి,<br>16—2—38

మద్దూరి అన్నపూర్ణయ్య<br>సంపాదకుడు,<br>నవశక్తి

---

**వచ్చే సంచికలో**

గురుముఖసింగ్ జీవితచరిత్ర

రాజాజీగారి రాజకీయ ఖైదీలు

ఇంకా కాంగ్రెస్ సమస్యల

గురించి ఎన్నో...

---



# ★ వ్యాఖ్యలు ★

### ఆంధ్ర విశ్వవిద్యాలయ కామర్సు విద్యార్థులసమ్మె

ఇది సమ్మెలయుగం. పత్రికవిప్పేసరికి సమ్మెలు అని పెద్దఅక్షరాల శీర్షికలు కనబడుతాయి. కూలీసమ్మెలే యిదివరకు జోరు కాని యిప్పుడాంధ్రదేశంలో విద్యార్థులలో అఖండ సంచలనం కల్గింది. గుంటూరు విద్యార్థుల సమ్మె ముగిస్తే నెల్లూరులో సమ్మె ఆరంభమైంది. అది పూర్తి అయ్యేసరికి బందరులో సమ్మె మొదలు. కృష్ణాజిల్లాలో హైస్కూలు విద్యార్థులలో సమ్మెలు చాలా ప్రబలినాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయ కామర్సువిద్యార్థులు తమ డిగ్రీలను ఆదరించడంలేదనే కారణంచే సమ్మె చేశారు యీ వారంలో. మదరాసు గవర్నమెంటువారు ఆంధ్రవిశ్వ విద్యాలయముపై యింత సవతితల్లి ప్రేమను చూపుట శోచనీయము. "తల్లిదండ్రుల మోసగించి" ధనవ్యయం చేసి, విశేష శ్రమ కోర్చి తుదకు డిగ్రీ పుచ్చుకుంటే యీ డిగ్రీలకు గడ్డిపరక౦త విలువ లేదని పొమ్మంటే యెంత ఘోరమో చూడండి. కాశీ వెళ్ళి యేమి తెచ్చావురా అంటే అదేదో అన్నట్లు యింత డబ్బు తగలేసి చదివి సంపాదించింది విలువలేని ఆంధ్ర విశ్వ విద్యాలయ డిగ్రీయా యనిపిస్తుంది. విశాఖపట్నం యూనివర్సిటీ కాలేజీలో ఉన్న 275 మంది విద్యార్థులలోనూ 140 మంది కామర్సు విద్యార్థులేనట. నూటికి 59 మందికి పైగా ఆదరణలేని డిగ్రీలకు తయారగు చున్నారన్న మాట. అయితే యెందులకీ కాలేజీ మూసివేయకూడదా యని యడుగుచున్నాం. ఇదివరలో ఎన్ని మొరలను పెట్టుకొన్నను అధికారులు పెడచెవిని బెట్టేశారు. పట్టప్రదాన మహోత్సవానికి రాజాజీగారు విశాఖపట్నం దయచేసినప్పుడు వారియొద్ద కూడ మొరపెట్టుకున్నా లాభం లేకపోయింది. "తప్పక మేలు చేస్తాను మీకు" అని రాజాజీ వాగ్దానమిచ్చి యున్యకార్య నిమగ్నుడై కాబోలు అశ్రద్ధ చేశాడు. ఈ సమ్మెచే ఆయనకు వెప్ప కల్గింది. వినయపూర్వక దర్జాతో ఆయన విద్యార్థులను సమ్మెను విరమింపుడని తంతిపై తంతి గొట్టేరు. "మీకు అనుకూల నిర్ణయము కలుగవచ్చు" అని వైసుఛాన్సిలరుద్వారా తంతినిచ్చారు. అప్పుడే విశ్వవిద్యాలయంవారు యీ డిగ్రీలను గుర్తింపవలెనని దరఖాస్తును త్వరితంగా పంపేశారు. రాజాజీయొక్క కోర్కెను మన్నించి విద్యార్థులు సమ్మెను చాలించారు. విద్యార్థుల హక్కు అంగీకరింప బడుతుందని నమ్ముచున్నాము.

★

స్వర్గానికెళ్ళినా విడాకులు తప్పలేదనట్లు కాంగ్రెసుగవర్నమెంటువచ్చినా సమ్మెచేసి ఒత్తిడిచేస్తేనేగాని చీమచిటుక్కుమనలేదు. కారణమేమి? దేశంబానిసదేశంకావడంచేత, తీర్పవలసిన యిబ్బందులకు మితిలేనందున ఎంత చురుకైన ప్రభుత్వానికైనా తొందరగాపని చేయడానికి వీలుండదు. మెల్లగా తాపీగా నడుస్తుంది. చక్రం. ఈలోగా ఎవరుమేల్కొని తమహక్కుల కొఱకు నడుంకట్టి పోట్లాడు తారో వారికే మేలుకల్గుతుంది. అందుచే ఆందోళన యేఉద్యమానికైనా ప్రాణవాయువు వంటిది. ఈసూత్రాన్ని గమనించి విద్యార్థులు విశాఖపట్నంలోనే కాదు దేశమంతటా మేల్కొన్నారు. తమదైనందిన హక్కులకొఱకు జోరుగా పోట్లాడుతున్నారు. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదని మదరాసు విద్యాశాఖా నిబంధనలలోని 8 వ అధ్యాయమును తొలగించుటకు తీవ్ర ఆందోళనను నల్పుచున్నారు. బొంబాయి ప్రభుత్వంవారు యీవిషయాన్ని గమనించి తమ నిబంధనలను సవరించుకొన్నా యింకా మదరాసు మంత్రివర్గంవారికి చలనం కలుగలేదు. తమ హక్కులకై ధైర్యంగా పోరాడుచున్న ఆంధ్ర విద్యార్థులను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాం. సమ్మెలను నిరసించే పెద్దలు చురుకుగా వ్యవహారాలు దిద్దుకొని సమ్మెలకు కారణాలను తొలగించాలని కోరుచున్నాం. సమ్మె చేస్తేనే గాని తమకు వెప్పపుట్టదు. సమ్మె చేస్తేమాత్రం కోపం—యీ వైఖరిమాత్రం క్షంతవ్యంకాదు.

### కాంగ్రెసు రిపోర్టు

కాంగ్రెసు మహాసభప్రధాన కార్యదర్శి కృపాలినిగారి సాంవత్సరిక నివేదిక కాంగ్రెసు యెన్నికలనుగూర్చి సభ్యత్వ అంకెలనుగూర్చి కొన్ని ముఖ్యవిషయాలను దెల్పుచున్నది. ఈ యేడు ముప్పదిలక్షలమంది నాల్గణాల కాంగ్రెసు సభ్యులు చేరారు దేశం మొత్తంమీద. ఎట్టివారిప్పుడు కాంగ్రెసులో అధికంగా చేరుచున్నారో యీక్రిందివిధంగా వారు వ్రాశారు.

"ముఖ్యంగా ఏయెండ కాగొడుగు పట్టే సమయానుకూల వాదులు, స్వార్థపరులు, తమ దారుణమైన ధనికవర్గ క్షేమాలను కాపాడుకొనేటందుకు కాంగ్రెసులో విశేషంగాను, తొందరగాను చేరుటవల్ల సహజంగా మన పని మరింత కష్టతరమైపోయినది."

కాంగ్రెసు సభ్యులసంఖ్య యింత విపరీతంగా పెరిగిపోవుటకు కారణం మంత్రిపదవీ స్వీకారమే యని కూడ వారు నిరూపించారు. కాని నిబట్టి మనము నేర్చుకోవలసిన గుణపాఠ మెద్ది యని మే మడుగుచున్నాము. ఇప్పుడు కాంగ్రెసుకు సంక్రమించిన అధికారం అతి స్వల్పమైనను ఇంతమంది ధనికవర్గ క్షేమం కోరు, స్వార్థపరులు చేరి ఆ యధికారమును ఆక్రమించుకొనుటకు ప్రయత్నిస్తూన్నప్పుడు, నిజమైన పూర్ణాధికారం ప్రాప్తించే సమయాన్ని యింకా యెంతమంది స్వార్థపరులు, పెట్టుబడివారలు, ఆ యధికారాన్ని కాజేయుటకు ప్రయత్నిస్తారో అర్థం చేసుకోవాలని సామ్యవాదులు కోరుచున్నారు. జనసామాన్య పోరాటంలో పాల్గొని అష్టకష్టాలు పడి తమ సర్వస్వం ధారవోసి సంపాదించిన హక్కులను కాస్త ధనికవర్గాలు అపహరించ కుండా యిప్పటినుంచి వర్గచైతన్యాన్ని కల్గించి కష్టజీవులను కట్టుదిట్టు చెయ్యాలని సామ్యవాదులుకోరుచున్నారు. అదే సామ్యవాద దృక్పధంలో స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపుటని చెప్పుటకు కారణమని ప్రజలు గ్రహింతురుగాక యని కోరుచున్నాము.

---

### బీహారులో రాజకీయ ఖైదీల విడుదల
### గవర్నరు అడ్డు తగిలితే మంత్రులరాజీనామా!

బీహారు ప్రధానమంత్రి తన రాష్ట్రంలో ఉన్న రాజకీయ ఖైదీల నందరను విడుదల చేయుటకు ఆర్డరు యిచ్చినాడనిన్ని గవర్నరు తన ప్రత్యేకాధికారాన్ని ఉపయోగించి అడ్డు తగిలితే రాజీనామా యిస్తాడని నమ్మకమైన వార్త అసోసియేటెడు ప్రెస్సువారు ప్రకటిస్తున్నారు.

### చీరాల సమ్మెలో కాల్పులు

చీరాలలో ఐ. యల్. టి. డి కార్మికులు సమ్మెచేస్తున్నారు. పికెటింగు చేయుచుండగా 14 వ తేదీన నాల్గు అయిదు సార్లు లాఠీచార్జి చేసిరట. తుపాకులు కాల్చిరట. ఒకడు చనిపోయినాడని తెలియుచున్నది.

### మైసూరు రాజకీయ ఖైదీల విడుదల

మైసూరు ప్రభుత్వంవారు రాజకీయఖైదీల విడుదలకు ఉత్తర్వు జారీచేశారు. మైసూరు కాంగ్రెసు బోర్డువారు సత్యాగ్రహాన్ని ఆపెయ్యాలని తీర్మానించారు.

### బర్మా

బర్మాలోకూడా రాజకీయ ఖైదీల విడుదలను గవర్నమెంటువారు అర్డరుప్యాసు చేసినారు.

## ★రాజమండ్రి వార్తలు★

[ మా ప్రతినిధి ]

**చుక్కావారికి చుక్కెదురా ?**

రాజమండ్రిమ్యునిసిపల్ సంఘవ్యవహారములునానాటికి శ్రుతి మించి రాగమును పడుతున్నాయి. 1938—39 బడ్జెట్టు, 1937—38 రివైజ్డు బడ్జెట్టును ఆమోదించుటకు పిలువబడిన సభ డాక్టరు శ్రీ॥ వెం॥ రామారావుగారు, దంగేటి నారాయణ స్వామిగార్ల సూచనపై సుమారు 15 దినములవరకు నిలుపుదల చేయబడినది.

తిరిగి యీ విషయమును గురించి ఆలోచించుటకు నిన్నను సభను పిలిచిరి. కాని కోరము లేక ఆగిపోయెను. మెంబర్లు చాలామంది తోటలోనే ఉన్నారు కాని హాలులోకి సభకు రాలేదు.

ఇట్లుండగా 17 మంది మ్యునిసిపల్ సంఘ సభ్యులు వ్రాతమూలకముగా చైర్మన్‌గారిపై తమకు విశ్వాసము లేదని తెల్పుచు రాజమండ్రి డివిజనల్ ఆఫీసరు గారి కొక పిటీషను దాఖలు చేసిరి. అందుపైని రాజమండ్రి డివిజనలు ఆఫీసరు గారు యీవిషయమును గురించి ఆలోచించుటకు 1938 మార్చి 3 వ తేదీని సభను పిలిచిరి. ఎన్నోసార్లు యీ అవిశ్వాస ప్రకటన ప్రసంగం జరిగింది. పూర్తి కాకుండానే కౌన్సిలర్లు పోవడం సాధా పరిపాటి యైపోయింది. చుక్కావారికి అప్పటు తన్నుచు చుక్కెదురౌచున్నా తప్పించుకొనే చాకచక్యం చూపిస్తున్నారు వారు.

### ఆల్కాటుతోటలోని హరిజనుల గోల

30 యేళ్ళ పైనుండి ఆల్కాటుతోటలోని హరిజనపేటలో నివసిస్తున్న హరిజన క్రైస్తవ సోదరులను యిళ్లు ఖాళీ చేయవలసిన దని జనవరి 21 వ తేదీని మ్యునిసిపల్ కమిషనరు గారు నోటీసు జారీ చేశారు. 15 రోజులలోగా ఖాళీ చేయకపోతే క్రమప్రకారము దావాచేసి "తొలగించేటట్లుచేస్తా"మనికూడా బెదరించారు. 30 యేళ్ళనుండి యిళ్లు కట్టుకొని పెళ్ళాం బిడ్డలతో కాపురమున్న వాళ్ళను 15 రోజులలో పొమ్మంటున్నారు. 'మ్యునిసిపాలిటీ' అనుమతి లేకుండా యిళ్లు కట్టుకున్నారు అని నోటీసులో వ్రాశారు. ఈసంగతి తెలుసుకోడానికి 30 యేళ్ళు పట్టింది కాబోలు మ్యునిసిపాలిటీవారికి. అసలు యీ కూలీలు రెయిల్వే కాలనీ ఉన్న స్థలంలో యిళ్ళు కట్టుకొని ఉండే వారనిన్ని రెయిల్వే కంపెనీవారికి ఆ ప్రదేశం అవసరం వచ్చి యీ కూలీలకు పరిహార మిచ్చి ఆ స్థలాన్ని తీసుకొని బొమ్మూరు ప్రాంతంలో ప్రస్తుతం న్యాయపతి సుబ్బారావు పంతులు గారి తోట ఉన్న స్థలంలోకి వీరిని పంపినట్లున్ను అక్కడ వీరు యిళ్ళు కట్టుకొని కాపురం చేస్తుండే విపరీతమైన కలరావ్యాధి వ్యాపించినట్లున్ను, అప్పుడు కలెక్టరు, మ్యునిసిపల్ చెయిర్మన్ శ్రీ॥ శే॥ గంటి వెంకట్రామయ్య గారు, కర్నం మునసబు వచ్చి యిప్పుడున్న జామితోటలో వారిని యిళ్లు కట్టుకొమ్మని అనుజ్ఞ యిచ్చినట్లున్ను విని కిడి. ఆస్థలంతవ్వలవారిది. తవ్వల కోటేశ్వరరావుగారికి యివ్వవలసిన శిస్తుబాపతు సొమ్ము విషయమై వారికి మ్యునిసిపాలిటీ వారికి కొన్నిదావాలు జరిగాయట. స్థల యజమానులతో మ్యునిసిపాలిటీవారు వ్యవహార పరిష్కారం చేసుకోవాలే కాని కూలి నాలి చేసికొని రెక్కల కష్టంమీద జీవించు యీ నిరుపేదలను లేచి పొమ్మనడం బాగా లేదు. కమిషనరుగారు, చెయిర్మన్‌గారు, కౌన్సిలరులు యీ సమస్యను న్యాయంగా పరిష్కరిస్తారని అనుకుంటున్నాను. ఈ సంగతు లన్ని యీ కూలీలు సభచేసి యీ 13 వ తేదీని కార్మిక బాంధవులగు అన్నపూర్ణయ్యగారికి తెలియజేశారు. ఆ పేటలోని హరిజన క్రైస్తవ సంఘాధ్యక్షులగు డాక్టర్ యస్. టి. జాకబ్‌గారున్ను యితర హరిజన ప్రముఖులున్ను సభలో పాల్గొన్నారు.

## సుభాస్‌జవహరులు

( 3 వ పేజీ తరువాయి )

దాసు ఉత్తరాన్ని బహిరంగంగా చదివి వినిపించి "గాంధిగారు పంపిన మాతనాకు సాక్షిసుమా!"యని ఎత్తిపొడవడం లోకవిదితంబోసుయొక్కకరుగంధ్లనుమితిలేకపోయింది. శత్రువుని నెమర్చావడం అతనికి తెలుసు. కాని 'మిత్రుల' దానిని భరింపలేకపోయాడు. జైలులో జబ్బుపడ్డాడు. విదేశాలకు వెళ్ళిపోయాడు. లక్నో కాంగ్రెసుకు వస్తూంటే మళ్ళీ పట్టుకొన్నారు. చిట్టచివర కెళ్లో ఆరోగ్యం పూర్తిగా భగ్నమైనతర్వాత గవర్నమెంటు విడుదల చేయక తప్పింది కాదు. గాంధిగారు అతనిని ఆశీర్వదింపక తప్పిందికాదు. చిరునవ్వుతో కౌగలించాడు సుభాసును మహాత్ముడు. కౌగలించి కౌగలించి జవహరు నింతవాణ్ణి చేశాడు. యిక బోసు నెంతవాణ్ణి చేస్తాడో? కాలమే నిర్ణయించాలి.

ఇంతవరకు విషమస్థితి యేర్పడినప్పుడల్లా జవహరులాలు గాంధిని కాదనలేకపోయాడు. తనభవిష్యత్తు నంతను ఫణంగ నుప్పుకొనియైనాసరే విషమస్థితిలో యెప్పుడూ ఎదిరిస్తూనే యున్నాడు బోసు. ఉద్యోగం వచ్చిన యిప్పుడు యేం చేస్తాడో చూడాలి. "ఉద్యోగాంతమునందు చూడవలెగా మా అయ్య సౌభాగ్యముల్" అన్నాడు కవివర్యుడు. ఇట్టి దశలో చూచాము జవహరును. అయ్యో! అనక తప్పింది కాదు, అనడానికి ఎంత మనస్సు ఒప్పకపోయినా. అటువంటి స్థితి బోసు విషయంలో కల్గదని నమ్ముతున్నాం.

ఉద్యోగ బంధం ఊడిపోయి ముక్తినిపొందిన జవహరులాలు తిరిగి తానై అతివాద శక్తులను నడిపి, దేశీయులలో నాతడు కల్గించిన ఆశను నెరవేరుస్తాడని ఆశిస్తున్నాం. జవహరులాలు అనుభవాన్ని చూచుకొని, తనయొక్క పూర్వ సాంప్రదాయాన్ని నిలబెట్టుకుంటూ దేశాన్ని ముందుకు తీసుకువెళ్ళుతాడు బోసు అని ఆశిస్తున్నాం. తాను కాంగ్రెసు అధ్యక్షుడయినాడను శుభవార్తను వినగానే "ఈ గౌరవము నాకు కాదు. భారత యువక బృందమున కని" అన్నాడు బోసు. యువజనాధ్యక్షుని మజా చూపిస్తాడు బోసు. ఇప్పటికి కాంగ్రెసు గద్దె నెక్కినవారందరిలోనూకుర్రవాడుబోసు. ఉద్యోగ భారాన్ని వీడిన వీర జవహరులాలున కిదే మా స్వాగతము అతివాద నాయకత్వానికి పక్ష స్వాతంత్ర్య సమర సేనాధిపత్యమును దాల్చిన భారత యువక సింహం సుభాస్ బోసుకిదే మా విజయగీతము శభాష్! సుభాస్ అను జయధ్వానములు మిన్ను ముట్టునట్లు మెలంగునుగాక!

విప్లవము వర్ధిల్లుగాక!





# దౌర్జన్యం పేరిట పౌరసత్వ హక్కులకు భంగం కల్గించ రాదు

## ఫైజపూర్ కంటె ఒకడుగు ముందు వేయాలి

( 6 వ పేజీ తరువాయి )

ఈపరిస్థితుల్లో కాంగ్రెసు మంత్రివర్గాలు జాతీయ విద్రోహులను, అధికారవర్గాన్నీ సామ్రాజ్యవాదాన్నీ ఎదిరించుచున్న ప్రజాశక్తులకు నాయకత్వం వహించాలి: ఫెడరేషనుకు వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. కాని కాంగ్రెసు నాయకత్వంలో కొందరు అటుల చేయక ప్రజాఉద్యమాన్ని అణచి అరికట్టి, సామ్రాజ్యవాదుల విద్రోహుల అభివందనాలు పొందుతున్నారు. ప్రజాసామాన్యం ఫైజ్‌పూర్ కార్యక్రమం ననుసరించి ముందుకు సాగుతూంది, నాయకులు సంకుచిత వాదులకు లొంగుతున్నారు. సామ్రాజ్యవాదుల ఎత్తులు జయం పొందడానికి అవకాశ మిస్తున్నారు.

ఫైజ్‌పూర్ కార్యక్రమాన్ని ప్రతీఘాతకులగు పెట్టుబడిదారుల, జమీందారుల బెదరింపులకు లొంగి, అమలు జరుపుటకు వెనుకంజ వేస్తున్నారు.

[బీహారు, మద్రాసులో జమీందారులకు వడ్డీవ్యాపారులకు లొంగారు.]

రాజకీయఖైదీల విడుదలచేస్తూ 'అహింసా వాతావరణం' ఏర్పడాలనే పేరుతో ప్రజాఉద్యమాన్ని అరికడుతున్నారు. అసహ్యకరమైన 107, 144 సెక్షనులు యింకా ఉపయోగిస్తానే వున్నారు. అన్నిటికంటే జుగుప్సాకరమైనది శాసనోల్లంఘనం రోజుల్లో సామ్రాజ్యవాదు లుపయోగించిన, రాజద్రోహ సెక్షను 124. ఎ. క్రింద అరెస్టులు చేయుట.

ఫైజ్‌పూర్ కాంగ్రెసు నిర్ణయించిన, ప్రజాసామాన్యంతో సంబంధం, జాతీయసంయుక్త ప్రతిఘటనకు విరుద్ధంగా కిసాన్ సంఘాలలో పనిచేయువారిపై చర్య గైకొంటున్నారు.

బ్రిటిషు యిండియాలోని ఉద్యమప్రభావం, స్వదేశీ సంస్థాన ప్రజలలోకూడా చైతన్యం గల్గించింది. మైసూరు తదితర సంస్థానాలలో ప్రజలు కాంగ్రెస్, రైతు, కార్మికసంఘాలు నిర్మించుకొని, తమ పౌరసత్వాలకొరకు ప్రజాప్రతినిధి ప్రభుత్వంకొరకు పోరాడుతున్నారు. మధ్యయుగపు నిరంకుశత్వం కొనసాగించుతున్న రాజులకు వ్యతిరేకంగా ఉద్యమం బయలుదేరింది. నేడు సంస్థానాలలోని ప్రజాఉద్యమానికి సానుభూతి సహాయం యివ్వడం, ఫెడరేషనకు వ్యతిరేకంగా సమష్టిగా పోరాటం సాగించడానికి అవసరం ఈవిషయంలో కలకత్తా అఖిలభారత కాంగ్రెసుకమిటి ఒకఅడుగు ముందువేసింది. కాని గాంధిగారి ప్రోత్సాహంతో వర్కింగు కమిటీ ఆతీర్మానాన్ని తోసిపుచ్చి సంస్థాన ప్రజలకు ద్రోహం చేసింది. ఇది జాతీయ ఐక్యతకు భంగకరము. సంస్థానాధిపతుల సహకారంతో ఫెడరేషను ఎదుర్కొందామనే పార్లమెంటేరియన్ల సంకుచితదృష్టి ఫలితమేఇది.

ప్రతి సమస్యలోనూ వర్కింగు కమిటీ వెనుకడుగు వేసింది. ఈవిధానమే హరిపుర కాంగ్రెస్ బలపరిస్తే ఫెడరేషను స్వీకారానికి దారి తీస్తుంది. ఈ విధానం వల్ల అన్నివైపుల అభివృద్ధి గాంచుచున్న జాతీయ ప్రజా సంఘటనకు విరుద్ధంగా సంస్కరణ వాదులకు లొంగిపోవుటయే: బానిస రాజ్యాంగాన్ని నిష్కారించడానికి, స్వాతంత్ర్యం కొరకు పోరాటం జయప్రదంగా సాగించుటకు అనువైన సమయంలో వెనుకంజ వేయుట వినాశానికి దారి తీస్తుంది.

జాతీయతకు విరుద్ధులైన జమీందారులు, పెట్టుబడిదారులతో రాజీ కొరకు చేయు ప్రతి ప్రయత్నము, కార్మిక, కర్షకుల ఉద్యమాన్ని, దౌర్జన్య రాహిత్యమను సాకుతో అణచే ప్రతి ప్రయత్నము, కిసాన్ సంఘాలను, కార్మిక సంఘాలను, సోషలిష్టులను కాంగ్రెసు నుండి దూరం చేయుటకు గావించు ప్రతి ప్రయత్నము, సామ్రాజ్య ప్రతికూలుర జాతీయ ఐక్యతకు విరుద్ధము. ఆ విధానం వల్ల మనం ఫెడరేషను ఎదిరించజాలము. ఫెడరల్ ఎన్నికలు జరపడానికి, ఫెడరల్‌కోయిలిషన్ మంత్రి వర్గం ఏర్పడడానికి అవకాశం దొరుకుతుంది. "దౌర్జన్య పోరాటం, చివరకు శాసనోల్లంఘనం సైతం లేకుండా క్రమంగా స్వాతంత్ర్యం సంపాదించడం" అన్న పెద్దల మాటలలోని నిజం బయట పడుతుంది. సామ్రాజ్యవాదానికి లొంగి మరల మనం "హిమాలయమంత తప్పు" చేసిన వాళ్ళ మవుతాము.

హరిపుర కాంగ్రెసు మహాసభ బొంబాయి వర్కింగు కమిటీ నిర్ణయాలను అవలోకించి, కాంగ్రెసుమంత్రులు యింత వరకు చేసిన పనులకు అభినందించుతుంది, అదే సమయాన జాతీయ శక్తు లందరి ప్రతినిధులు, యిదివరకు సంపాదించిన అనుభవాలనుండి, ముందుకు సాగుటకు కొన్ని సూత్రాలను నిర్ణయించాలి. సామ్రాజ్యవాదంతో రాజీ విధానం కొట్టివేయాలి. పార్లమెంటరేతర ప్రజా ఉద్యమం అణచివేసే పాలసీని రద్దు గావించాలి. అతివాదు లంతా జాతీయైక్య సంఘటనా విధానాన్ని జయం సంపాదించేవరకు కొనసాగించాలి.

కాంగ్రెసు మంత్రి వర్గాలు నిర్బంధ శాసనా లన్నీ రద్దు చేయాలనీ, తాము రద్దు చేయలేని వాటిని 144, 107 సి. పి. సి. 124 ఐ. పి. సి శాసనాలు కార్మికుల పైన, రైతులపైన, రాజకీయోద్యమాలకు ఉపయోగించరాదనీ నిర్ణయించాలి. ఏసందర్భంలోనూ సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానం సమర్థించరాదు. అర్థంకాని, మత సంబంధమైన దౌర్జన్య రాహిత్య సూత్రాలను, పౌరసత్వ హక్కులను, కుంటుపరచడానికి ఉపయోగించరాదు. ఏ సందర్భంలోనైన మంత్రులు, అధికారులు, గవర్నరులు వ్యతిరేకించుట వల్ల చేయలేని పనుల గురించి ప్రజలకు తెలియజెప్పి ప్రజల ఉద్యమ బలంతో గవర్నర్లతో చివరివరకు పోరాడాలి.

కార్మిక, కర్షకులకు సంబంధించిన శాసనాలు గావించుటలో, పెట్టుబడిదారులు జమీందారులతో రాజీపడుటను కాంగ్రెసు మహాసభ వ్యతిరేకించాలి. ఎన్నికల ప్రణాళిక ననుసరించి మంత్రులు చేయు శాసనాలకు ప్రారు అభ్యంతరాలు కల్పించినచో, ప్రజలు తమ హక్కు కొరకు చేయు పోరాటాన్ని బలవంత పరచాలి. కార్మిక కర్షక, కాంగ్రెసు సంఘాల సలహా ఆమోదాలు పొంది మంత్రులు పరిశీలనా సవరణ పెట్టాలి. అపుడు బిల్లును బలపరచడానికి రాష్ట్ర మంతటా ప్రచారం జరిగి, ఎన్నికల వాగ్దానాల నెరవేర్చుచున్నందులకు మంత్రులకు బలం చేకూరుతుంది. జాతీయ విద్రోహుల అభ్యంతరాలు సన్నగిలుతాయి....

శ్రామేడ్ బాట్లీవాలా

కాంగ్రెస్ హయాంలో రాజద్రోహానికి శిక్షింపబడ్డారు.

కాంగ్రెసు మహాసభ ప్రజల శాసనసభేతర కార్యక్రమాన్ని ప్రోత్సహించాలి. కార్మికుల ప్రతి సమ్మెను, రైతుల యాత్రలను ప్రజాందోళనను మంత్రుల కించపరుస్తున్నాయనే నేరారోపణ చేస్తూ ప్రజా పోరాటాన్ని వృద్ధి పొందరాదనే విధానాన్ని నాశనం గావించాలి.

ఇపుడు మంత్రివర్గాలు తగవులకు జడిసి, పెట్టుబడిదారులు, జమీందారులతో రాజీకి లొంగుతున్నారు. కాని వారు కొంచెం సంస్కరణలు యిచ్చినా ప్రజా ఉద్యమం సంఘాలు బలపడతాయనీ, యింకా ఎక్కువ కోరుతారనీ ఎరిగివుండియే జమీందారులు వగైరా స్వల్ప సంస్కరణలకు కూడా అడ్డు వస్తున్నారు.

బీహారు, యు. పి. లలో రైతుసంఘాలకు వ్యతిరేక ప్రచారం ఆపుచేయాలి. రైతుసంఘాలు జాతీయ సంఘటనలో ముఖ్యమైన కర్షక వర్గాల్లో సంచలనం గల్గించాయి. వర్కింగు కమిటీ రైతులు ప్రత్యేక సంఘాలు ఏర్పరచుకొనే హక్కును అంగీకరించినా, కిసాన్ సంఘ పనులు కాంగ్రెసు మూలసూత్రాలకు విరుద్ధమనీ, కిసాన్ సభ్యులు దౌర్జన్య వాతావరణం కల్గించడానికి తోడ్పడ్డారని సూచించింది. అంటే ఆచరణలో కాంగ్రెసువారు కిసాన్‌సంఘాలలో పని చేయరాదనే బీహార్ కాంగ్రెసు తీర్మానాన్ని సమర్థించిందన్నమాటే. దీనివల్ల అహింస పేరుతో పౌరసత్వ హక్కులు అరికట్టబడుటకు అవకాశ మిచ్చింది. కాంగ్రెస్ మహాసభ కిసాన్ సభలను బలపరచి జాతీయ ఐక్య సంఘటనలో చీలికలు రాకుండా చేయాలి.

# పోలండులోని ఫేసిస్టు రాక్షస కృత్యాలు

# ఫేసిస్టు ఘాతుక కృత్యాలకు బలి అవుతున్న స్పైన్

( 5 వ పేజీ తరువాయి. )

యంతో, ప్రజాప్రభుత్వము నణచివైచి, ఫాసిస్టునిరంకుశ నియంతృత్వమునే గనక ఫ్రాంకో స్పెయిన్‌లో స్థాపించగలిగిన యెడల, మెడిటరేనియను సముద్రములో బ్రిటిష్, ఫ్రాన్సులయొక్క బలమునకు గొప్ప ముప్పము వాటిల్లక తీరదు. కనుకనే తటస్థవిధాన సిద్ధాంతమును బ్రిటన్ వెంటనే అంగీకరించింది. ఇటలీ, జర్మనీలు మటుకు కొన్ని మినహాయింపులతో ఈసిద్ధాంతమును అంగీకరించెదమని, కొంతకాలము గడిపినవి. ఫాసిస్టువిద్రోహులకు, ఇటలీ, జర్మనీలు, పోర్చుగల్‌ద్వారా పుష్కలముగా ఆయుధ సామగ్రులను, వేలకు వేలుగా సైనికులను పంపినవి. తటస్థవిధాన సిద్ధాంతప్రకారం, నిజముగా, ఏదేశముగూడ స్పెయిన్‌కు ఆయుధ సామగ్రులను పంపగూడదు. కనుక, విద్రోహులకు ఫాసిస్టు దేశముల నుండి ఆయుధ సామగ్రులు సప్లయి అవుతుంటే, ప్రజాప్రభుత్వము ఏదేశములనుండి ఆయుధసామగ్రులు కొనుటకు వీలు లేకపోయింది. ఎంతధనముంటే ప్రయోజన మేమిటి? యూరపులో, బ్రిటన్, ఫ్రాన్సుల తరువాత స్పెయిన్ ప్రజాప్రభుత్వమునకే ఎక్కువ ధనముకలదు. కాని ప్రయోజనం?

ఈపరిస్థితులలో ఆగస్టు 19 వ తేదీన, ఏవిధమైన ఆయుధ సామగ్రులను స్పెయినుకు పంపకూడదని బ్రిటన్ శాసించింది. వెంటనే ఇతరదేశాలు, చాలా వరకు ఈవిధానమునకు అంగీకరించినవి. ఇటలీ, జర్మనీలు గూడా! తటస్థముగా ఉండుటకు బహిరంగంగా ఒప్పుకున్నవి. కాని, పోర్చుగల్ ముఖ్యపట్టణమగు లిస్బన్‌ద్వారా ఇటలీ, జర్మనీలు ఆయుధసామగ్రులను, సైనికులను పంపిస్తూనే ఉన్నవి. కనుక తటస్థవిధాన ఫలిత మేమయింది? ఫాసిస్టు విద్రోహుల ఘోరకృత్యములకు, అన్యాయ యుద్ధమునకు సహాయపడింది.

స్పానిషు యుద్ధం ఎంతఘోరమైన విషయమో ఇక్కడ వేరేవ్రాయ నవసరంలేదు. అక్కడ ఫాసిస్టులు చేయుచున్న అత్యాచారములను గురించి వ్రాయ లంటే, ఎంతైనా వ్రాయవచ్చును. ప్రపంచములోని ఒక గొప్పదేశమును, ఒకగొప్పజాతిని నాశనంచేయుటకు, కాథలిక్‌చర్చి, ధనికవర్గాలు కలసి చేస్తున్న విషాద దురంతములు ఇంతింత యని చెప్పుట కలవికాదు. ఈ యుద్ధంయొక్క అర్థం ఇంతేకాదు. ఇటలీ, జర్మనీలలో స్థాపించబడిన ఫాసిస్టు నిరంకుశ తత్వమునకు ఒక అంతర్జాతీయ రూపం గలిగి, ప్రపంచంలోని ప్రజాప్రభుత్వములను ధిక్కరించుటకు ఫాసిజం పూనుకున్నదని అందరు తెలుసుకొన వలసియున్నది. ప్రపంచంలోని ప్రజా స్వామికమునకు (Democracy) ఫాసిజమునకు స్పెయిన్‌దేశం యుద్ధభూమిగా మారినది.

తటస్థవిధానం అమలులో ఉన్నప్పటికి, ఫాసిస్టు దేశములన్ని విద్రోహులకు పూర్తిగా సహాయం చేస్తున్నవని, వార్తాపత్రికా విలేఖరుల ప్రత్యక్షప్రమాణముల వల్ల స్పష్టమగుచున్నది. స్పెయిన్ దేశమంతటా, ... విమానములను, బాంబులను మారణ యంత్రములను, పెట్రోలును, స్పెయిన్‌లో విదేశపత్రికా విలేఖరులు ప్రత్యక్షంగా చూశారు. ఇవన్ని పోర్చుగల్ ద్వారా వస్తున్నటుగూడా స్పష్టమయింది.

ఇటలీ, జర్మనీలతోపాటు, ఫాసిస్టు నిరంకుశ తత్వమునకు తోడ్పడుచున్న ఈ పోర్చుగల్ దేశాన్ని గురించి అందరు తెలుసుకొనుట అత్యవసరం. పోర్చుగల్ దేశంలో ప్రస్తుతం అమలులో ఉన్నది ఒక కాథలిక్ నిరంకుశ నియంతృత్వం. సాలజారు అను ఒక అమానుష వ్యక్తి, ఈ దేశమునకు ప్రధాన మంత్రి. దేశ పరిస్థితు లన్ని చాల వృద్ధిలోను, క్రమముగాను వున్నవని ప్రపంచము నంతను మోసగించిన కుబుద్ధి సాలజారు: అతడు అధికారమునకు వచ్చినప్పటి నుంచి, లెక్కలన్ని గూడుపుఠాణీ చేసి, ఎంతో ధనం దేశమునకే మిగిలి యున్నట్లు, నేషనల్ బడ్జెట్‌ను ప్రకటించాడు: కాని నిజ వృత్తాంత మేమిటి? జాతి సమితి లెక్కల ప్రకారం, సాలజారు ప్రకటన లన్ని మోసంతో గూడినట్లు తెలుస్తుంది. ఉదాహరణ 1934—35 లకు సాలజారు ప్రకటన ప్రకారం 1504 కాంటోలు లేక 15,000 పౌనులు దేశమునకే మిగిలినట్లు (Surplus). జాతిసమితి లెక్కల ప్రకారం 2,800,000 పౌనులు డెఫిసిట్! సాలజారు నియంతృత్వము వల్ల, పోర్చుగల్ దేశం అధోగతిపాలైంది. ఇక్కడ గూడా సైన్యాధిపతుల, మతాధికారుల నిరంకుశమే. దేశములో విద్య అన్న మాటే లేదు. పైగా ఈ చిన్న దేశములో, సి. ఐ. డి. డిపార్టుమెంటుకు ఖర్చు 1,000,000 పౌనులఖర్చు! బ్రిటిష్ సామ్రాజ్యమంతటిలోను ఈ డిపార్టుమెంటుకు అయే ఖర్చు 250,000 పౌనులు. ప్రజలలో సాలజారుకు అంత నమ్మక మన్న మాట! రాజకీయముగా, సాంఘికముగా ప్రజలకు కనీస స్వాతంత్ర్యమైనా లేదు. రాజ్యాంగ విధానమును ఎవరైనా విమర్శిస్తే చాలు, కఠోర మగు శిక్ష విధిస్తాడు సాలజారు. టైమ్ యండ్ టైడ్ అనే పత్రిక (Time and Tide: Sept 12 1936) ప్రకారం, రాజకీయ ఖైదీలను సాలజారు పెట్టే బాధలకి హద్దు లేదు. తలలను బైండింగు ప్రెస్సులలో పెట్టి తిప్పుతాడు. శరీరములను కాల్చుతాడు. దిగంబరులను చేసి చలిలో, చచ్చేవరకు కారాగారంలో ఉంచుతాడు. ఒక గుండ్రటి సున్నా చుట్టి నడిపిస్తాడు—క్రిందపడి చచ్చేంతవరకూ. ఎలక్ట్రిసిటీ వల్ల రాజకీయ బందీలకు షాక్సు ఇస్తాడు ఖైదీచావంగానే ఆత్మహత్య అని ప్రకటిస్తాడు నిర్దయుడైన సాలజారు. పోర్చుగల్ లోని ఆత్మహత్యల సంఖ్యలకు మితే లేదు. ఈ నిరంకుశ విధానాన్ని నిరసించిన వ్యక్తుల నెందరినో ద్వీపాంతర వాసానికి, తిండి లేక చావటానికి వీలైన మన్యాలకు, అడవులకు పంపించేశాడు. ఇటువంటి వ్యక్తి, ఫ్రాంకోకు సహాయం చేసేది. ఈ వృత్తాంత మంతా ప్రపంచాని కంతా తెలియకపోవుటకు కారణం, అంతర్జాతీయ రాజకీయాల్లో పోర్చుగల్‌కు ఎక్కువ ప్రాముఖ్యత లేకపోవుటవల్ల, ఎవరూ ఎక్కువగా తెలుసుకొనుటకు ప్రయత్నించలేదు. గనుక ఇదే గాక, ఈ ఘోర వృత్తాంతమును బహిరంగపరచ ప్రాణ ఘాతసమానమైన సాలజారు?

సాలజారు, ఫ్రాంకో, ముసోలినీ, హిట్లరులకు సరిపోయింది జోడు. పోర్చుగల్ ముఖ్యపట్టణ మగు లిస్బన్‌లోని అవీజ్ హోటల్‌లో, విద్రోహ నాయకులు, ఇటలీ జర్మనీలనుంచి వచ్చిన సేనాధిపతులు మకాం వెయ్యటం, పత్రికా విలేఖరులు తమ కళ్ళతో చూశారు. పైకి తటస్థ విధానం, అంతర్జాతీయ న్యాయానికి ఎంత విరుద్ధం: ఫాసిస్టులు ఎంతటి ఘోరములకైన వెనుదీయని పిశాచములు గదా!

న్యాయసమ్మతముగా, ఎన్నికల ద్వారా స్థాపించబడిన ప్రజాప్రభుత్వమును కూలద్రోయుటకు, సిగ్గులేక, సహాయం చేస్తున్న ఇటలీ, జర్మనీలను గురించి వేరే వ్రాయ నక్కరలేదు. 1931 లో దేశమును వదలిపెట్టిన అల్ఫాన్సో రాజు ఈవెనింగ్ స్టాండర్డు పత్రికా విలేఖరికి చెప్పినట్లు, ప్రజా ప్రభుత్వమును ఓడించి, రాజరికవాదులు, మితవాదులు, ధనికవర్గములు, చర్చి కలిసి తిరిగి నిరంకుశపాలన స్థాపించుటే, వీరి ఉద్దేశ్యం.

## స్పెయిన్‌లో ఫాసిస్టులఘోరములు.

ప్రజా ప్రభుత్వ సైనికులను, వారికి సానుభూతి చూపించు ప్రజలను వేలకు వేలుగా ఉరితీయుట: పొలాల్లో, బాంబులను పెట్టి, ఏమి ఎరుగని అమాయిక రైతులను, వ్యవసాయపు కూలీలను చంపుట, ఊళ్ళను మొత్తముగా కాల్చివేయుట: విమానములనుంచి బాంబులను వేసి ప్రజా సమూహములను హతం చేయుట—ప్రజా సామాన్యము యొక్క పిల్లలకు విషముతో గూడిన తినుబండారములను పెట్టి, చంపుట—ఒక రకం కాదు. ఒక పద్ధతి లేదు. స్పెయిన్‌లో ఫాసిజం ఒక భూత రూపం దాల్చింది. దీని కంతా, వెదకి చూస్తే కారణం—ప్రజా సామాన్య అభివృద్ధియే. కలలో నైనా తలపెట్టని చర్చికి ధనికబలం, రాజకీయ బలం ఉండకుండా చేయుట! జమీందారీ పద్ధతి రద్దుచేయుట: ప్రజలందరికి దరిద్రము లేకుండా తిండి ఉండేటట్లు చేయుటయే!

కాథలిక్ మతాధిపతియైన పోప్, ఈ తిరుగుబాటును ఒక పవిత్ర యుద్ధమని, కాథలిక్‌ను తమను రక్షించ ఫ్రాంకో చేయుచున్న యుద్ధము చాల న్యాయమని, ప్రపంచములోని కాథలిక్ మతస్థు లందరు దీనియందు సానుభూతి చూపించి, సహాయం చేయవలెనని ప్రకటించాడు: 14వ సెప్టెంబరుమన దేశంనుంచి కాథలిక్ మతాధికారులు, స్కూళ్ళలో విద్యార్థులవద్ద చందాలు ప్రోగుచేసి ఈ ఫాసిస్టుల దురంతాలకు సహాయం చేశారు. ఇంతకన్న వింత ప్రచారం ఏమి కలదు? కాథలిక్ మతం పేరుతో స్పెయిన్ ప్రజా సామాన్యము నెంత ధ్వంసము కావించుచున్నదో విదితమైనది. కాథలిక్ మత సంరక్షణ కొరకు మొరాకోనుంచి స్పెయిన్‌కు వచ్చి మహమ్మదీయ సైనికులు పోరాడుటయా!

ఈవిధంగా ఫాసిస్టులు ఘోర కృత్యములు చేస్తూ ఉంటే, యూరపులోని ముఖ్యమైన దేశము లన్ని, ఇంకా తటస్థవిధానమే: అవలంబించుట ఆశ్చర్యకరము గాదా! దీనిలో ఏమైనా అర్థం ఉందా!

( మిగతా 15 వ పేజీలో )

శ్రీ కె. సత్యనారాయణ బి. ఏ. (ఆనర్సు) బి. యల్.



# గృహనిర్మాణ సమస్య

## గిరిగారి సూచనలు

పెట్టుబడిదారీ విధానంలో పరిశ్రమాభివృద్ధి ఒక దశకు వచ్చిన తర్వాత పరిశ్రమలలో పనిచేయు పనివారలకు పరిశ్రమదారులే నివసించుటకు గృహములను నిర్మించి యిస్తారు. మనదేశములో కూడ జెమ్‌షెడ్‌పూర్, కాన్‌పూర్, బొంబాయి, కలకత్తా మొదలగు పరిశ్రమ కేంద్రాలలో పరిశ్రమదారులే ఆచటి కూలీలకు యిళ్ళుకట్టించి యిచ్చారు. అదేవిధంగా కోయంబుత్తూరులోని మిల్లు పనివాళ్ళకు కూడ యిళ్ళను కట్టించి యిచ్చే ప్రయత్నాలు జరుగుతున్నయి.

ఈగృహనిర్మాణ సమస్యయొక్క ప్రాముఖ్యతను గురించి, గృహాలను నిర్మించి కూలీలకివ్వటం మూలాన ఎవరికి ఎటువంటి లాభంఉన్న సంగతిని గురించి, ఈగృహనిర్మాణ సమస్యను యేవిధంగా నిర్వహించాలి అన్న సంగతిగురించి, కార్మికులకును పరిశ్రమదారులకును మంత్రి అయిన వి. వి. గిరిగారు కోయంబుత్తూరులో వారి దృక్పథానుసారం విపులంగా ఉపన్యసించారు. ఈఉపన్యాసం జనవరి 21 'హిందూ' పత్రికలో ప్రచురింప బడ్డది.

పరిశ్రమ దారులే పనివారలకు యిళ్లుకట్టించి యివ్వటంవల్ల సమ్మిశ్రిత లాభంఉన్నది అని గిరిగారు చెప్పారు. ఆసమ్మిశ్రిత లాభాన్ని యీక్రింది విధంగా వివరించారు.

"ఇళ్లు కట్టించి యిచ్చిన యజమానులకు కూలీలు ఎక్కువగా అణిగి మణిగి ఉంటారు: (కార్మికుల హక్కు లన్ని యజమానులు పూర్తిగా యిచ్చే వరకు సమ్మె తీవ్రంగా సాగించాలిసిందే అని చెప్పే సోషలిస్టులతో) కలిసే స్వతంత్రం తగ్గిపోతుంది: (వీటి ఫలితంగా 'చేసిన పనికి తగిన కూలివ్వాలి, ఫ్యాక్టరీ ఆక్టులోని హక్కు లన్ని సక్రమంగా యివ్వాలి' అనే హక్కులకోసమని) బేరమాడే శక్తి కూలీలకు తగ్గిపోతుంది. కూలివాడు పనిలోనుంచి తీసివేయబడినప్పుడు పని లేనివాడే కావటం కాకుండా యిల్లు లేనివాడుగా కూడా అవుతాడు. సరైన కారణం ఉండి సమ్మె చేసినప్పుడు కూడా యిళ్ళలోనుంచి లేచిపోండన్న యజమానుల బెదరింపు కూలీలను కొన్ని సమయాల్లో త్వరలో లొంగిపొయ్యేట్టు చేస్తుంది." (బ్రాకెట్సులో వ్రాసినది నేను)

అన్నివిధాల కూలీలు అస్వతంత్రులు కావటం, యే క్షణంలో యిల్లు లేనివాళ్ళం అవుతామో అనే అదురుతో అనవసరంగా అణిగి మణిగి ఉండాల్సిన అవస్థ పట్టటం అనేటువంటి సమ్మిశ్రిత పరిస్థితి కూలీలకు లాభకరమైన దని అంటారని అనుకోను.

ఉపన్యాసాన్ని ముగిస్తూ గిరిగారు యీ క్రింది విధంగా చెప్పారు.

"పనివాడు యింటికి యజమాని కావటానికి యిల్లు కట్టటానికి అయిన ఖరీదంతా చెల్లాలి. కాబట్టి కొన్ని సంవత్సరాలు తీసుకుంటుంది. పనివాడు యే కారణం చేనైనా సంపాయించుకొని తాను ఉంటున్న యింటికి అట్టాల్సిన అద్దె కట్టలేనంత శక్తి లేనివాడు కావచ్చు లేక అకస్మాత్తుగా మరణించవచ్చు...... ఇటువంటి పరిస్థితిలో కూలివాడు మరణించిన తర్వాత ఆ యిల్లు కతని సంసారానికి దక్కనుయ్యేటట్టుగా యిన్‌స్యూరెన్సు యేర్పాటు చెయ్యటానికి యెవిధంగానైనా వీలుంటుందేమో అనే సంగతిని గృహ నిర్మాణ సమస్యను అమల్లో పెట్టేవారు ఆలోచించాలి."

ఇల్లు కట్టటానికైన డబ్బు వసూలయ్యేందుకు, కూలివాడు కాలం చేసిన తరువాత వాడు కాపురమున్న యిల్లు వాని సంసారం యొక్క స్వాధీనదాయ్యేందుకు యీ యిన్‌స్యూరెన్సును సూచన. ఇన్‌స్యూరెన్సును యేర్పాటు చెయ్యాల్సిన బాధ్యత స్థానిక నిర్వాహకులకు వదిలేశారు. ఈ యిన్‌స్యూరెన్సు వల్ల యింటికైన ఖరీదు ఖరాగా వసూలౌతుంది. కూలివాని మరణానంతరం వాడు కాపురం చేసిన యిల్లు వాడి సంసార స్వాధీన మవటం అనే విషయం అందరిచేత ఉన్నాదనుకోబడుతున్న భగవంతుడే నమ్మాలి: కూలివాడు మరణించిన తరువాత ఆ యింటిని వాడి సంసారము యొక్క స్వాధీనపర్చటం అనేది రైల్వే యూనియన్‌లో గిరిగారు యేర్పరచిన లింకుఫండు మాదిరిగా అవుతుందని యెందుకు అనుకోకూడదు? ఇళ్ళు కట్టించటానికి అయిన ఖర్చును రాబట్టుకునే పద్ధతినే యిన్‌స్యూరెన్సు యేర్పరచమని చెప్పటం మూలంగా సూచించారు గాని యిందు మూలంగా కూలీలకు కలిగే కష్టాలు పోగొట్టే పద్ధతుల నేమి సూచించలేదు పరిశ్రమలకు కార్మికులకు మంత్రిగారైన వి. వి. గిరిగారు, ఇన్‌స్యూరెన్సు విషయం ఆలోచిద్దాం. దీని బాధ్యత స్థానిక నిర్వాహకులకు వదలబడ్డది. ఈ స్థానికనిర్వాహకులు తప్పనిసరిగా పాలసీ ప్రీమియములను కూలివాని కూలిలోనుండే కట్టి మిగతాదే కూలివాడి కిచ్చేట్టుగా యేర్పాటు చేస్తారు. అసలే అనేకవిధాల కోతలు, ఫైన్లు మూలంగా తక్కువకూలే గిటుతున్నది. అందులో, ఆ తక్కువకూలిలో ప్రీమియములకోసమని యింకా కొంత తగ్గిస్తే, ఉన్నదుండగా ఉపాకర్మ అన్న విధంగా, కూలివాని చావు త్వరగానే సమీపిస్తుంది. మరణానంతర సమాచారం——కూలివాడు మరణించిన తర్వాత ఆ యిల్లు కూలివాని సంసారానికి స్వాధీనమయ్యేందుకని యిన్‌స్యూరెన్సు యేర్పాటు. కూలివాడు మరణించగానే వాడు మావద్ద పనిచేస్తున్నకాలంలో మాదగ్గర కొంత తీసుకున్నాడు, మా దగ్గరవాడు తీసుకున్నదానికి, యిన్‌స్యూరెన్సు ద్వారా ఉన్నదానికి చెల్లుబోయింది, కాబట్టి యింటి ఖరీదు అట్లాగా ఉంది, కనక యిల్లు మీ స్వాధీనం కావటానికి వీల్లేదు. అంటే మరణించిన కూలివాని సంసారం గతి యేంకావాలి?

కూలీలకు యజమానులు యిళ్ళుకట్టించి యివ్వటమనే పద్ధతిమంచిదే. కాని గిరిగారు కోయంబుత్తూరులో చెప్పినపద్ధతిగానే చేసేట్టయితే కూలీలకంటె యజమానులకే లాభంజాస్తి. పెట్టుబడిదారీ వర్గానికి కార్మికవర్గం శాశ్వతబానిసగా ఉండటానికి వీలౌతుంది. కాబట్టి కూలీలకు గృహనిర్మాణ పద్ధతివల్ల లాభం కలగాల్నంటే యిళ్ళుకట్టించి యివ్వటం మూలంగా కూలీలమీద యజమానులు తగని అధికారం చెలాయించే వీలులేకుండా చెయ్యాలి. అదెట్లా వీలౌతుంది? యేసమయంలోను యజమానులు కూలీలను బెదరించి యిళ్ళలోనుంచి వెళ్ళకొట్ట గూడదని, యిళ్ళమీద యజమానులకు యేవిధమైన అధికారం ఉండకూడదని, యిన్‌స్యూరెన్సుకు ప్రీమియములు పెట్టుబడిదారులే కట్టేట్టుగాను చట్టాలనునిర్మించిన యజమానులు కూలీలను యీవిషయంలో అన్యాయం చెయ్యటానికి వీలుండదు.

ఇప్పుడు శాసనసభల్లో యేదైనా బిల్లు ఆక్టు కావాలంటే ప్రజాసామాన్యంయొక్క సంఘటన,బలంచాలా అవసరం. కాబట్టి పారిశ్రామిక పనివారల మీటింగులు ఊరేగింపులు జరిపి గృహనిర్మాణ సమస్యనుగురించి, గిరిగారి పద్ధతివల్ల కలిగే అపాయాన్ని గురించి, ఈ సందర్భంలో కూలీలకు అనుకూలంగా ఉండే బిల్లులు ప్యాస్‌కావాల్సిన అవసరాన్నిగురించి తీవ్రఆందోళన తీసుకురావాలి. శాసనసభలవద్దకు కార్మికయాత్రలను కూడా జరపాలి. ఇదంతా కూలీలకు అనుకూలంగా ఉండే చట్టనిర్మాణం చాలాఅవసరం అని మంత్రులకు తెలియపర్చటానికే.

ఈపనిని నిర్విఘ్నంగా నెరవేర్చటంలో సోషలిస్టుపార్టీలు, కమ్యూనిస్టులు, కాంగ్రెసుసంఘాలు, యితర సామ్రాజ్యవ్యతిరేక సంఘాలు కలిసి పని చెయ్యాల్సిన అవసరం అవకాశం ఎంతోఉంది. ఈవిధంగా చేసిన సామ్రాజ్య వ్యతిరేకసంఘటన సిద్ధాంతరీత్యానే కాకుండా ఆచరణరీత్యా సఫలమవుతుంది. హిందు దేశ స్వాతంత్ర్యోద్యమచరిత్రలో సామ్రాజ్యవ్యతిరేక సంఘటనను ఆచరణరీత్యామొదటిసారి కాన్పూరు సమ్మెసమయంలోచూశారు. కూలీల హక్కులు కాపాడబడటానికి అవసరమైన బిల్లులు ప్యాస్‌కాటానికి సామ్రాజ్యవాద వ్యతిరేకసంఘాలన్నియు కలసిపనిచేసిన యునైటెడ్ ఫ్రంటు ఆచరణరీత్యా యేర్పడటమేగాక కార్మిక జనసామాన్యానికి శాసన రక్షణకొంతకలుగుతుంది. గృహనిర్మాణ పద్ధతికూలీలకుకూడా అనుకూలంగా ఉండాల్నంటే కూలీలకు అనుకూలమైనటువంటి ఈవ్యాసములో ఉదహరించిన చట్టాలు నిర్మింపబడాలి. చట్టనిర్మాణానికవసరమైన ఆందోళనను, ప్రచారాన్ని సామ్రాజ్యవ్యతిరేకులంతా కలసి చెయ్యాలి.

శ్రీ ఘోలేపెద్ది కృష్ణమూర్తి

## కాంగ్రెసుకు

## కమ్యూనిస్టుల జేజేలు

( 11 వ పేజీ తరువాయి )

సంస్థాన ప్రజల పోరాటాన్ని గురించి కలకత్తా తీర్మానాన్ని హరిపూర్ కాంగ్రెసు బలపరచాలి. మైసూరులో నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా జరుపుచున్న ప్రజల పోరాటాన్ని బలపరచాలి. స్వదేశీ సంస్థానాలలో జరుగుచున్న నిర్బంధ విధానాన్ని నిరసించటానికి, అఖిల భారత స్టేట్సు పీపిల్సు కాన్ఫరెన్సు సహకారంతో ఒకరోజు నిర్ణయించాలి. పౌరసత్వ హక్కుల కొరకు, బాధ్యత గలిగిన శాసనసభలకొరకు వారు గావించు ఆందోళనకు నైతిక, భౌతిక సహాయం చెయ్యాలి. కార్మిక కర్షక, కాంగ్రెసు సంఘాలు నిర్మించుకొనే స్వాతంత్ర్యం వుండాలి. రాచకీయ ఖైదీలందరిని విడుదల చేయాలి. ఫెడరల్ శాసన సభకు ప్రతినిధులను ప్రజలే ఎన్నుకొను హక్కుండాలి. హరిపుర కాంగ్రెసు సంస్థాన ప్రజల, కనీసపు కోర్కెల బలపరుస్తూ తీర్మానించాలి. సంస్థాన ప్రజల పోరాటానికి నాయకత్వం సంపాదించనిదే, కాంగ్రెసు ఫెడరేషను కు వ్యతిరేకంగా జరిపే పోరాటం జయం పొందదు.

మనం ఫెడరేషను భగ్నం చేయటానికి అన్ని విధాల పోరాడాలి. శాసనసభా తీర్మానాల ద్వారా ఫెడరేషను మనపై రుద్దవద్దని పార్లమెంటుకు తెలియజేసాము. ప్రజా ప్రతినిధి పరిషత్తు భారత రాజ్యాంగాన్ని ఏర్పాటు చేయాలని తెలియజేసాము. ఇంతటితో పూరుకోరాదు. ఫైజిపూర్ కార్యక్రమాన్ని ఆచరణలో పెడుతూ ముందుకు సాగాలి.

కొంతమంది ఫెడరేషనుకు వ్యతిరేకపోరాటం, పార్లమెంటరీ ఆందోళనతో సరిపుచ్చాలని ప్రయత్నిస్తున్నారు. సామ్రాజ్యవాదులు ఫెడరేషను అమలు నందుంచుటకు అన్ని ప్రయత్నాలు గావించుతున్నారు. 1939 లో రాజుగారు యిండియా వత్తురని యూటరు వార్తలు తెలుపుతున్నాయి. హరిపురకాంగ్రెసు ముందు చేయవలసిన పనికి నిర్ణీతకార్యక్రమం యేర్పాటు గావించాలి.

కాంగ్రెసు మహాసభ దేశవ్యాపక మైన ప్రజాఉద్యమాన్ని ప్రారంభించాలి. ప్రజాస్వామిక హక్కులను సాధించుటకు అనగా ఫెడరేషను భగ్నంచేయుటకు పోరాటం సాగించాలి.

ఇండియా గవర్నమెంటు నూతన రాజ్యాంగ చట్టంక్రింద యింకా అధ్వాన్నంగా వుంటుందనే సంగతి అందరంగీకరించినదే. అందుచే ఫెడరల్ ప్రభుత్వం రాష్ట్రాలలో స్థితినికూడ హీనపరుస్తుంది. అందుచే ఫెడరల్ మంత్రివర్గాల ఏర్పరచుటనే సమస్య రానేరాదు.

ఫెడరల్ విధానాన్ని అమలు జరుపకుండా చేయుట, రాజ్యాంగ విధానాన్ని భగ్నం గావించుటకు చేయు ప్రత్యక్ష పోరాటమే అవుతుంది. ఈపోరాటంలోకి ప్రజాసామాన్యమంతా ఆకర్షింప బడుటకు వారిలో చైతన్యం కలిగించు కార్యక్రమం మనం యివ్వాలి. ఫెడరల్ విధానంలో ఎన్నికలహక్కు ప్రజలది కాదని, వైస్రాయికి నిరంకుశాధికారాలున్నాయనీ, రైల్వే రిజర్వుబ్యాంకుపై ఫెడరల్ ప్రభుత్వానికి ఎట్టిహక్కు లేదని, బ్రిటీషు కాపిటలిస్టుల లాభంకొరకు ఏర్పరచిన రాజ్యాంగమని ప్రజలకు తెలియజేయాలి.

మహాసభానంతరం వెంటనే మనం ఫెడరేషనుకు వ్యతిరేకంగా, ప్రజాస్వామిక హక్కులకొరకు ప్రజా ఉద్యమాన్ని లేవదీయాలి. మనం కనీసహక్కు లివ్వనిచో రాజ్యాంగాన్ని సంపూర్ణంగా బహిష్కరిస్తామని, దానిని నాశనం గావించటానికి పోరాటం ప్రారంభిస్తామని చాటిచెప్పాలి. ఈఉద్యమంకొరకు ప్రతి జిల్లాలో, ఫిర్కాలోను [council of Action] పోరాటం నడిపే సంఘాలను ఏర్పాటు చేయాలి. వానిలో, కాంగ్రెసు, కార్మికకర్షక సంఘాల ప్రతినిధులు, ఎక్కవలోవున్న సంస్థానప్రజల ప్రతినిధులు వుండాలి. ఈఐక్యసంఘాలు ఫెడరేషనుకు వ్యతిరేక ఆందోళన పోరాటాలను ఆర్గనైజు చేయాలి. అన్ని వృత్తులలోని ప్రజాసామాన్యాన్ని దేశవ్యాపితమైన సమ్మెకు పన్నుల మక్తాల నిరాకరణానికి తయారు చెయ్యాలి.

ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ఎన్నికలు జరిపినచో కాంగ్రెసువాటిని బహిష్కరించాలి. కాంగ్రెసు మంత్రులు రాజీనామాలిచ్చి ప్రత్యక్ష పోరాటాన్ని ఫెడరేషనుకు రాజ్యాంగ విధానానికి వ్యతిరేకంగా సాగించాలి. రాజ్యాంగచట్టాన్ని నాశనం గావించుటకు సంస్థాన ప్రజాప్రతినిధులతోకూడిన కానిస్టిట్యుయెంటు అసెంబ్లీకొరకు, రాజకీయఖైదీలందరి విడుదలకొరకు కార్మిక కర్షకుల కనీసపు హక్కులకొరకు అల్పసంఖ్యాకుల హక్కుల రక్షణకు మనం నిలబడి పోరాడాలి.

హరిపురకాంగ్రెసు మహాసభ పోరాటంయొక్క విధానాన్ని, వివిధ తరగతులను నిర్ణయించాలి. ఏవో తీర్మానాలుమాత్రం గావించి రహస్య రాయబారాలు జరుపుపద్ధతిని నిషేధించాలి. ప్రజలలో ఎక్కువ భాగాన్ని కార్మికకర్షకులను పోరాటంలోకితెచ్చు కార్యక్రమంతో, అంతిమ జాతీయ పోరాటానికి ప్లాను వెయ్యాలి.

ఈ సంవత్సరం కాంగ్రెసుసభ్యులు విపరీతంగా హెచ్చారు. కాంగ్రెసు పతాకంక్రింద 30 లక్షలు ప్రజలు చేరారు. ఇక రాచకీయరంగంలో వెనుకపడిన అల్పసంఖ్యాకులు ముస్లిములు వగైరాకూడా కాంగ్రెసులో చేరుచున్నారు. కాంగ్రెసు శక్తి ప్రతిష్ట ప్రజలలో హెచ్చింది. దీనికికారణం ఏమిటి? కొంత రిదివరకటి నాటుల ప్రజలు పోరాటంలో అలసటచెందియా? పోరాటం వదలి కాన్‌స్టిట్యూషనలిజం వైపు పోవుట చేత నంటారా? కాదు! ముమ్మాటికాదు. సభ్యత్వం పెరుగుట గతసంవత్సర పోరాట ప్రతిబింబమే. అటులే రైతుసంఘాల, కార్మికసంఘాల సభ్యత్వం వృద్ధిపొందుట గాంచుచున్నాము. సామ్రాజ్యవాదాన్ని జాతీయ విద్రోహులగు జమీందార్లు పెట్టుబడిదాతో పోరాడు సంస్థగా కాంగ్రెసును ప్రజలు వీక్షించుచున్నారు. ప్రజలు తమను ఆర్గనైజు చేయునది నడిపేది కాంగ్రెసని యెంచుతున్నారు. హరిపురంలో సమావేశం కానున్న ప్రతినిధులు ప్రజల యీ ఆశలు సఫలం చేసే బాధ్యత తమపైవుందని గ్రహించాలి. వెనుకంజ వేసే పాలసీరద్దుచేసి, జాతీయ ఐక్యసంఘటనద్వారా శక్తులన్నిటిని అంతిమ యుద్ధానికి తయారుచేసే నిర్ణయాలు హరిపురకాంగ్రెస్ చేయాలి.

కాంగ్రెసు మహాసభ వర్ధిల్లుగాక!
జాతీయ ఐక్య సంఘటనానికి జే!
నూతన రాజ్యాంగాన్ని బహిష్కరించండి!
జాతీయపోరాటం ముందుకు సాగించండి!
ఫెడరేషనం నశించాలి!
కాన్‌స్టిట్యూయెంట్ ఎసెంబ్లీ కావాలి! రావాలి!!
సంయుక్త ప్రజాస్వామిక ప్రభుత్వం వర్ధిల్లాలి!

ఇట్లు
యూసఫ్
బంకిం ముఖర్జీ
యస్. వి. దేశపాండే
యస్. ఏ. డాంగే
ఆర్. డి. భరద్వాజ్
ఎ. కె. ఘోష్
కె. యన్. జోగ్లేకర్
యస్. యస్. మిరాజ్‌కర్
ఎ. పి. జోషి
జె. బుఖారీ
ముజఫర్ అహమ్మద్
యస్. వి. ఘాటే









( 12 వ పేజీ తరువాయి. )

### బ్రిటన్, ఫ్రాంసుల వైఖరి.

ఈ దొంగ తటస్థ విధానమైన అమలులోకి రాకపోయినచో, ఇంకొక యూరపు మహాసంగ్రామమే తప్పదని, ఇప్పుడు ఈ విధానము వల్ల, ఆ సంగ్రామము తప్పిపోయినదని కొందరు వాదింపవచ్చును. అలా కానియెడల బ్రిటన్, ఫ్రాంసుల వైఖరికి అర్థమేమి? ఫ్రాంసు, బ్రిటనులకు మెడిటరేనియనులో ఎక్కువ అధికారాలుగలవు. ఫేసిజమే జయము పొందినచో వీటికి ముప్పువాటిల్లక తీరదు. కాని ఫ్రాంసు విదేశ రాజనీతి ఎప్పుడూ బ్రిటిష్ విదేశ రాజనీతి మీద ఆధారపడియున్న సంగతి అందరికి తెలిసిన విషయమే. ఇక బ్రిటన్ యొక్క వైఖరి ఏమిటి? బ్రిటన్, స్పానిషు ప్రజా ప్రభుత్వమునకు సహాయం చేయక, తటస్థ విధాన మాలోచించుటలో ఉద్దేశ్య మేమిటి?

ఈవిషయాన్ని ఆలోచించి చూస్తే, బ్రిటన్‌కు ప్రజా ప్రభుత్వమునందు ఏమాత్రం సానుభూతి గూడ లేదని వెల్లడి యగును. స్పెయిన్ ప్రజాపక్షము గెలిచినయెడల, కార్మిక కర్షకుల రాజ్యాంగము తప్పక స్థాపించబడును. అది ఏమాత్రం బ్రిటన్‌కు ఇష్టం లేదు. కమ్యూనిస్టు స్పెయిన్ కన్న ఫాసిస్టు స్పెయినే బ్రిటిష్ ప్రభుత్వానికి అనుకూలమా అనే ప్రశ్న వస్తుంది. స్పెయిన్ దేశమే ఫాసిస్టు అయితే, మెడిటరేనియనులో బ్రిటన్, ఫ్రాంసుల బలం తగ్గక తప్పదు. అయినప్పటికి ఇటలీ, జర్మనీలతో ఏవిధమైన సంధికైనా ఒప్పుకుంటుంది బ్రిటన్. ఇప్పుడు, అన్యాయంగా చైనాను ధ్వంసము చేస్తున్న జపానుతో, చైనాలో ఎన్నియో అధికారాలు గల బ్రిటన్, ఎన్ని అవమానములకైనా ఓర్చి, తటస్థభావం వహించి, సంధిపడుచుండుట మనం అందరం చూస్తూనే ఉన్నాం. అబిసీనియా యుద్ధాన్ని బట్టి చూసినా, బ్రిటన్ వైఖరి, ఇదే యని స్పష్టమగుచున్నది. అంతేకాని, ప్రజాసామాన్య ఉద్యమాలు బలపడటం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కేమాత్రం ఇష్టం లేదు. ఇదేగాక, స్పెయిన్ ప్రభుత్వమున కేమాత్రము సహాయం చేసినప్పటికి, యూరపు మహాసంగ్రామం తప్పదు. అప్పుడు వెనకాల దాగుకొని విద్రోహులకు సహాయం చేస్తున్న ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ దేశాలు ఆస్ట్రియా, హంగేరి, గ్రీసు మొదలుగాగల దేశాలతో బహిరంగంగా యుద్ధరంగంలో దిగుట కేమాత్రం వెనుదీయవు. ఈమహాసంగ్రామమునకు ఏమాత్రం బ్రిటన్ ఒప్పుకోదు. బ్రిటిష్ సామ్రాజ్య పునాదులన్ని, కాలనీలలోని స్వాతంత్ర్యోద్యమాలతో, కదిలి, వణకటం పారంభించిన ఈ రోజుల్లో బ్రిటన్ మహాసంగ్రామమున కొప్పుకుంటుందా? ఇంకొక మహాసంగ్రామమంటే, బ్రిటన్ యొక్క సామ్రాజ్యాధికారము అంతమయిందనే అర్థం. ఇటువంటి పరిస్థితులలో, ఇష్టము లేనప్పటికి, ఫేసిస్టుల ఘోర అన్యాయములకు తోడపడుచున్న బ్రిటన్ సామ్రాజ్య వైఖరి, తేటతెల్లముగదా తటస్థవిధానమను దొంగనాటకంతో, స్పెయిన్ ప్రజా ప్రభుత్వ నాశనానికి తోడ్పడుచున్నాయి బ్రిటన్ ఫ్రాంసు దేశాలు.

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యౌషధం

### సుధాచంద్రిక

సీసా 1కి రు. 2—0—0

సుధాచంద్రిక [illegible] కారణములకు క్రిములను సంహరించి [illegible] మొదలంట రూపుమాపును. మొదటి [illegible] స్రావము కట్టి వేయును. [illegible] మంట పుండు తగ్గించును. [illegible] సహితము [illegible].

### వసంతకుసుమాకరం

తు1కి రు 10—0—0

వసంత కుసుమాకరం తు 1 కి రు 10—0—0 లు [illegible] తయారు చేయబడినది. [illegible] దాయుష్య [illegible]. అతి మాత్రము. [illegible] ప్రసిద్ధి కెక్కినది. [illegible].

శ్రీ [illegible]సముద్రం ఫార్మసీ,
రాజమండ్రి

### మరబియ్యం తినడం?
### మరణబాధ పడడం?

★ మానవ జీవితానికి ఆహారం అవసరం

★ ఆహారంలేక జీవించడం అసంభవం

పుష్టికర ఆహారం ఆయుర్దాయాభివృద్ధికల్గించుతుంది.

కాని మీరుతినే మిల్లుబియ్యంలో

పుష్టికర పదార్థాలు లోపించివుంటాయి

అందువల్లే అనీరసం—అజీర్ణం—అనుశ్యంచిపోతుం.

లోపించిన పదార్థాలు చేరుకునేందుకు దంపుడు బియ్యం వాడాలి. మేము గత [illegible] సంవత్సరముల నుంచి స్వయముగ ధాన్యం దంపించి విరివిగ సప్లయి చేయుచున్నాము. మానమ్మకమును వెల్లడి చేయుటకు మావద్దగల యోగ్యతాపత్రములే సాక్షి.

భమిడిపాటి సూర్యనారాయణమూర్తి
అండ్ బదర్సు,
గంగాచారి కోట్లు, రాజమండ్రి.

[illegible] అర్థశాస్త్ర గ్రంథములుగా, రాజకీయ [illegible], స్వాతంత్ర్య [illegible], [illegible] కావాలంటే,

### అతివాద గ్రంథ మండలి

[illegible] సభ్యులుగా చేరండి. చవుకలో—గ్రంథాలు—కరపత్రాలు ప్రకటిస్తాము.

అతివాద గ్రంథమండలి యొక్క గ్రంథములు త్వరలో రానున్నవి.

వెంటనే సభ్యత్వము పొందండి.

అన్నిచోట్లకు ఏజంట్లు కావలయును.

ఉత్తర ప్రత్యుత్తరములకు [illegible] 0-1-0 స్టాంపు [illegible].

వివరాలకు:—

[illegible] కామేశ్వర రావు
అతివాదగ్రంథమండలి,
గుంటూరు.

★



వీరు
ఏల బాధపడెదరు?

★
★ ★



ఏజంట్లు లేని చోట్ల
ఏజంట్లు కావలెను.

మూలవ్యాధి కన్న భరింపరాని బాధ మరియొకటిలేదు. మీరు ఆ వ్యాధితో బాధపడుచున్న యెడల వీటో వాడి వెంటనే స్వస్థత పొందుడు వీటో కొద్ది నిమిషాలలోనే బాధ తగ్గించును. ఎట్టి మొండి వ్యాధినైన అపరేషను లేకుండగనే నిర్మూలము చేయును.

★ అనేక డాక్టర్లచే మెప్పును పొందినది ★

ఒక అర్ధణా బిళ్ల పంపువారికి శాంపిల్ ఉచితముగా పంపబడును.

వివరములకు:

**వీటో మాన్యుఫేక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.**

**వీటో ప్రతిచోట దొరకును**



Printed by V. Suryanarayana Sastry at Srinivasa Press and Edited and Published by M. Annapurniah } Rajahmundry.

